# Andhra Dramas

AND

# Andhra stage.

BY

TEKUMALLA ACHYUTA RAU M. A., L. T.,

"The true philosophy of the Drama lies in its being an imaginative imitation of life."

*(H. Reed.)*

The Chintamani Printing Works,
RAJAHMUNDRY.
1926.

 [Price As. 0—6—0.

## BOOKS BY THE SAME AUTHOR.

1. Andhra Songs and Ballads. (Telugu.)
0—4—0.

2. History of the Telugu Literature in the Vizianagaram Empire Part I. (Telugu.
(in print.)

3. Life and Works of Pingali Suranarya, being a Comprehensive and Critical History of the life and works of the grea poet. (English.)
(in print.

☞ Copies can be had from the Author.
Rajahmundry.

# ఆంధ్రనాటకములు,

## రంగస్థలములు.



గ్రంథకర్త

పోకుమళ్ల అచ్యుతరావు, యమ్. ఎ., యల్. టి.,

“ త్రైలోక్యస్యాస్య సర్వస్య నాట్యం భావానుకీర్తనం”

(భరతముని:-నాట్యశాస్త్రము.)



(మొదటికూర్పు 500 ప్రతులు.)

శ్రీచింతామణిముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

రాజమండ్రి.

1926



[వెల రు. 0—6—0.

DEDICATED

TO

MY FATHER

TEKUMALLA KAMAYYA GARU

Born 1839 [Circa]-died 3—4—1899

Simple and innocent in life
He cared for others than his own;
But God in recompense has shown
His Mercy to his childr'n and wife.

నాతండ్రియగు

టేకుమళ్ల కామయ్యగారికి

అంకితము చేయబడినది.

జననము 1839 మరణము 3—4—1899.

తే. గీ. మాయయును మర్మమెఱుఁగక మనుచు నెన్ను
మాలినిచ్చలు నితరుల మేలుఁగోరె;
దేవదేవుండు ప్రత్యుపకృతికొ యనఁగఁ
బత్నీసుతుల కపారదయను జూపె.

---

# పీ ఠి క.

ఈగ్రంథమందలి మొదటియధ్యాయమును ప్రసిద్ధ నాటక వాఙ్మయాభిమానియగు పురాణం సూరిశాస్త్రిగారి ప్రోత్సాహముచే 1926 సం॥లో వ్రాసి కృష్ణాపత్రికలోఁ బ్రచురించితిని. తరువాతఁ గొన్ని వత్సరములవఱకు పింగళి సూరనార్యకవి జీవితరచనానిమగ్నుడనై యీనాటకగ్రంథవిషయమును గట్టిపెట్టితిని. ఇటీవల "సారస్వతసర్వస్వము" పత్రికాధిపతియగు ఏలూరుపాటి రామభద్రచైనులుగారు తమ పత్రికకుఁ గొన్నివ్యాసములనుఁ బంపుడని కోరగా మూడవ అధ్యాయభాగము వ్రాసి వారిపత్రికకుఁ బంపితిని. నాల్గవ యధ్యాయ మాంధ్రసాహిత్య పరిషత్తులోఁ జదువబడినది. గ్రంథమునుఁ బూర్తిచేసెడు తలంపుతో మిగిలిన రెండధ్యాయములను రచించి యన్నిటిని పుస్తకరూపమునుగాఁ బ్రకటించితిని. ఈగ్రంథమందేదైన సుగుణలేశమున్నయెడల సరసులు గ్రహించి సంతసించిన నాశ్రమయంతయు సార్థకమైనదని తలంచెద.

నేను గ్రామాంతరము వెళ్ళినకాలములో మొదటి రెండధ్యాయములు ముద్రింపబడుటచే ఋజువు పత్రములు [Proofs] సరిగదిద్దుటకు వీలులేక కొన్ని అచ్చుతప్పులుండి పోయినవి. వానినన్నిటిని శుద్ధపట్టికలోఁ జేర్చితిని. సుహృదయులు లోపమును క్షమింతురుగాక.

ఆంగ్లభాషయం దుత్తీర్ణులయ్యు, గీర్వాణాంధ్రభాషల యందు మహాపండితులై, బహుగ్రంథసంపాదకత్వమునఁ జిర కీర్తిఁ గడించిన బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవి ఎమ్. ఎ. గారు నాట్యశాస్త్రమున కాదిమఋషియనదగు భరతముని నాట్యశాస్త్రమును ముద్రింపించుచూ నాయిచ్చిన గ్రంథము నాదరించి ప్రస్తావన వ్రాసినందుకు నేనెంతయుఁ గృతజ్ఞుడను.

కోరినవెంటనే తనయభిప్రాయమును వ్రాసి నాకుఁ బంపిన మదీయ స్నేహితుడగు విద్వాన్ గరిమెళ్ళ సోమన్నశాస్త్రులు ఎమ్. ఎ., యల్. టి., గారికి నాకృతజ్ఞతాభి వందనములు నర్పించుచున్నాను. వారిచ్చిన యుదారభావస్ఫురితమైన యుత్కృష్టాభిప్రాయము నీగ్రంథమున సాదరముగ జేర్చితిని.

ఇట్లు,

24—6—1926,
రాజమహేంద్రవరం

విద్వజ్జనవిధేయుడు,
కే. అచ్యుతరావు.

# గ్రంథప్రస్తావన.

నాటకలక్షణప్రతిపాదక మగునీచిన్నగ్రంథము పింగళి సూరనాదికవికావ్యవిమర్శన ప్రఖ్యాతులై యాంధ్రలోక మునఁ జిరపరిచితులును విశేషించి మాకుఁ జిరకాలమిత్రులు నగు బ్రహ్మశ్రీ పేకుమళ్ళ అచ్యుతరావుపంతులు ఎం. ఏ., ఎల్. టి., గారు రచించి బహుపత్రికాముఖముల ననుదినము వెలువడు నాటకతత్త్వప్రకటనములలోఁ గలవివాదగ్రంథులఁ జాలవఱకు భంజించి సహృదయలోకమునకు సమర్పించుట యెల్లర కామోదకరము. ఆంధ్రభాషలో నాటకలక్షణగ్రంథ ములు లేకుండుటయు, సంస్కృతములో భరతాదిమహామతుల యాశయములు సంపూర్ణముగా నేభాషలోఁగాని ముద్రణావ స్థకు రాకుండుటయుఁ గొన్నిశతాబ్దులుగా భరతఖండమున నాటకప్రదర్శనవిద్య శాస్త్రసమ్మతముగాఁ గాక యథాదేశ కాలసౌందర్యముతో నగతికశరణ్యముగా విలసిల్లుచున్నను దెనుఁగుభాషలో నదియుఁ గానరాక ఖండాంతరవాసుల పరి చయదోషముచేఁ దద్గ్రంథప్రణాళికల ననుసరించి యనుదినము ప్రభవిల్లుచున్న నాటకసముదాయ మక్కడక్కడ క్లేశభూయిష్ఠ [illegible]చు మనస్విజనములకు హృదయసంవాదమును సమగ్ర ముగాఁ గలిగింపనేరక విషమసమస్యోత్పాతములకు జన్మభూమి యగుచుండుటవలనఁ గవికర్మముననో నటకౌశలముననో లేక

సభాసదుల యధికారసంపత్తిలోనో లేక నీనివిషమసమావేశ మునసో జనించినలోపము లెట్టివైనా యవి యెట్లు పరిహరణీయ ములో పండితులు చర్చించి నిర్మక్షిక మగు కావ్యసుధారస మును దృక్ఛ్రోత్రములఁ గ్రోలఁజూచుట యాశ్చర్యము కాదు. ఈచిన్నగ్రంథము "ఆంధ్రనాటకములు" అని పరిమితార్థక నామము ధరించినను లోనఁ బరిశీలింప నాటకతత్త్వమునగ్రంథి స్థానముల భేదించు విమర్శగ్రంథమై "నాటకతత్త్వసారము" అనునామమునకుఁ దగియున్నది. ఇందు స్థూలముగా నాటక తత్త్వము, కథానిర్మాణము, పాత్రముల శీలప్రతిష్ఠాపనము సుఖాంతదుఃఖాంతవిభాగవిచారము, ప్రదర్శనశక్తి యను నైదంశములు చర్చింపఁబడినను ప్రసంగవశముగా నేఁటికాలపు వివాదాంశము లన్నియుఁ బరిష్కరింపఁబడినవి. పైనైదంశము లలోఁ గడపటిరెండును ముఖ్యముగాఁ గడగొట్టుది కేవల మేక దేశమై దేశకాలోపాధిచే బాధితమగుటచే నేఁటికాలము లోని యాంధ్రనటసంఘముల కౌశలము నే ప్రతిపాదించి గ్రంథనామమును సార్థకము చేసినను మొదటిమూఁడు విచారములు నాట్యశాస్త్రమూలతత్త్వము నే ప్రతిబోధించును. నాటకము లోకస్వభావమునకుఁ బ్రతిబింబప్రాయ మయ్యును లోకమువలెఁ గాక రంగప్రదర్శనము క్షణకాలములోనే యాధ్యాత్మపరిపాకమును గల్పించి దేహిని బరిశుద్ధుఁగాఁ జేయుటయె నాటకోద్దేశ మని వీరు స్థాపించుట ధర్మప్రతిష్ఠాపకు లగు మహర్షుల ముఖ్యోపదేశమునకు భిన్నప్రస్థానము గా నేరదు.

నాటకములు కేవలము భావనాజన్యములే కాని, యనఁగా వినర్తకృత్రిమాదిరూపములే కాని, ప్రకృతికి సంపూర్ణముగా సభేదప్రతిబింబములు కావని వీరు సిద్ధాంతీకరించిరి. భరతాదులు శృంగారాదిరసములు సహిత మలౌకికసిద్ధము లగునానంద విశేషము లనియుఁ బ్రమాణజ్ఞులు భాషాప్రయోగమంతయు శబ్దార్థముల రెంటను కేవలము కృత్రిమ మనియే ప్రతిపాదించిరి.

నాట్యప్రదర్శనము కేవలము లోకమునకుఁ బ్రతిబింబ మని తలఁచువారు గీతరచనయుఁ బద్యరచనయు రసపోషణమునకుఁ బ్రకృతిసిద్ధములా? వాని నేల పరిహరింపఁగూడ దను విప్రతిపత్తిని గ్రహించి పద్యగీతరచనలు రెండును బరమార్థముగ రసపోషకములే యని గ్రంథకర్త నిర్ధారించెను. అభినవగుప్తాదినాట్యవేదవ్యాఖ్యాతలీ మూఁడంశముల నిట్లే పరిష్కరించిరి.

భాషాభేదము పాత్రభేదము ననుసరించినయెడల సర్వ మవ్యవస్థ మగు నని సూచించి జాత్యాచారపదప్రవృత్తుల కనుగుణముగా నాంధ్రభాషలోనే వ్యాకరచన కూర్పవచ్చు నని సిద్ధాంతము చేసి భాషారచనయు నాట్యధర్మములలోఁ జేర్చి పంతులవారు నాటకలక్షణాంతర్గత మగు యథార్థతత్త్వమును వ్యక్తపఱచిరి.

ఇటఁ గ్రంథనిర్మాణవిచారమున నాంధ్రభాషలోని శిష్టగ్రామ్యవిభేదములఁ జర్చించి గ్రామ్యేతిహాసికకథాశరీరములఁ బ్రవర్తిల్లు

సమానుషస్వభావవర్ణనములకు లోకాభిప్రాయప్రవాహసిద్ధమగు రూపమునే గ్రహింపవలయు నని మునిమతమే ప్రతిపాదించిరి. ప్రసంగవశముగా నాటకములు సభాసదులయాంత్మసంస్కారమున కనుగుణముగా నుండవలయు నని శాసించిరి. ఇది చాల జటిలప్రశ్నము. లోకము భిన్నరుచిక మగుటచేం గథారుచి కనుగుణముగా నధికారసంపత్తి గల సామాజికులే చూడవత్తురు. నాటకసుఖసిద్ధికిం గేవలము కవి, నట, గాయక, వాదక, జవనికాసామగ్రులే కాక సభ్యులసంస్కారపటిమయుం దోడ్పడు ననువిచారమునకుం దొడంగుటలో నేంటికాలపు విమర్శకులలో వీరే ప్రథము లగుదు రేమో.

శిలప్రతిష్ఠాపన మను మూండవవిచారము చాల సుందరముగా సంఘటింపంబడియె. నీరసములు నిరుపయోగములు, నిమ్నపాతనములు నగు వస్తుశరీరములం బరిగ్రహింపక యుదాత్తగుణసౌందర్యవ్యక్తీకరణమే మానవాంతఃకరణ మాలిన్యముం దొలంగించి ధర్మాదిసాధనోపాయ మగుచుం గృతార్థతాపరిగ్రాహక మగు నని వీరు ప్రతిపాదించిరి. అవాంతరప్రసంగముగాం బాత్రగుణముల నూరక పేర్కొన్నం జాలదని భరతాదులు ప్రకారాంతరమునం జతుర్విధాభినయసాధనము లని పేర్కొన్న భావభావనారూప మగు పాత్రగుణ వ్యక్తీకరణము శ్రేష్ఠ మని సిద్ధాంతము చేసిరి. పురాణగాథల గ్రహించినపుడు లోకప్రవాహసంసిద్ధ మగు గుణౌచిత్యమునే పోషింపవలయు నని ప్రతిపాదించుటయు మహర్షుల యాశయమే.

ష్ల్లనది యగు సుఖాంత దుఃఖాంత నాటకవిభాగ నిచారిముసు నీరియూశయము పరమార్థమున నాట్యాచార్యు లతో గలసినను నాసాతనుగ విషాదాంత ప్రదర్శనము ముని సమ్మతిము గాదేమో. అట్లయినను భాసాదుల యూరుభం గాది నాటకములు నిక్కముగా విషాదాంతములే. సుకుమార జనమనః క్లేశకరము లయ్యును విషాదాంత నాటకములు మహో న్నతులకు మాత్రము తప్పక తీవ్రప్రబోధ కారణము లని గ్రంథకర్తతో సంగీకరింపవలసినచ్చును.

నాటకప్రదర్శన మనున్నైదవవిచారము కేవల మాం గ్లనాటకరంగముల కే నర్తనూసకాలమునకే చెల్లుచున్నం దునుం పిర్వాచార మాసాతి గౌరసప్రతిపత్తుల కే తాసల మగును.

న్నైపేసిసవిచారము లన్నియు నాటకతత్త్వవిమర్శ నుగ జీవాతువు లగుఘట్టములు. ఈగ్రంథము కేవలము సూత్రప్రాయము యాసదగు. దీనిలో నొక్కొకయంశము విస్తరింపబడి యుంనినయెడల గ్రంథబాహుళ్య మైనను సామాన్యజనుల కెక్కుడుయుద్భోధకముగా నుండును. అర్థ స్థాయిము లను మనుపటి నాల్గువిచారములును సోదాహరణ ముగా మారిమతోపొద్బలముతో విస్తరించి ప్రౌఢ మగు నాకృతి యొసంగిరేని గ్రంథకృతి యొల్లరకు మిక్కిలి రమణీయ మగుటయేగాక యాంధ్రనాటకవిమర్శసోపానపరంపరలో నుపేక్షింపజాలని మెట్టగు నని దృఢముగాఁ జెప్పవచ్చును. శాస్త్రా లవాక్య రచనా మర్యాద ననుసరించి సర్వజనసుకర ముగా ఈగ్రంథము రచించిరి. ఇది యెల్లరకు నిష్పక్షపాత ముగఁ బ్రహర్షదాయక మగు నని తలంచుచున్నాను. ఈవిచార

పరంపరను వీరు స్వబుద్ధితోడనే నాటకతత్త్వమును తరిచి ప్రకటించినను నాట్యాచార్య సిద్ధాంతములతోఁ బెక్కువిష యముల నేకీభవించుట వీరిప్రతిభకు మెఱుఁగు తెచ్చుచున్నదని యట్టి ముఖ్యాంశముల నిందుఁ బేర్కొంటిని.

ఈ పూర్వవిజ్ఞప్తి నన్ను రచింపుమని పంతులవారు నన్నుఁ గోరుట వారికి నాయందుఁ గల మైత్రిప్రతిపత్తికి సాక్షీభూత మగుచున్నదని నా యంతరాత్మ యానందించినను దీనిలో నున్న గుణముల నించుక స్పృశించి చూపుట తదాసంగ జన్యము కాక కేవలము నాట్యశాస్త్రపరిశీలన క్లిశ్యమాన ప్రతిభాలవవిశ్రాంతికారణ మనియే సహృదయోక్తి గ్రహింతురుం గాక యని పండితులఁ బ్రార్థించుచున్నాఁడను.

రాజమహేంద్రవరము,
24 జూన్ నెల 1926. } మా. రామకృష్ణకవి.

---

# పండితాభిప్రాయములు.

:o:

విద్వాన్ గరిమెళ్ల సోమయాజులు పంతులు ఎమ్. ఏ., ఎల్. టి., గారు:

"శ్రీ చేకుమళ్ళ అచ్యుతరావుపంతులు ఎం.ఏ., ఎల్.టి., గారు రచించిన యీ ఆంధ్రనాటకములు అను విమర్శగ్రంథ మునందు నాటకముల ప్రయోజనములును ప్రదర్శన పద్ధతు లును ఇప్పటి తెలుఁగునాటకముల గుణదోషములును వి[illegible] లముగను వివేకముతోడను చర్చింపఁబడినవి. నాటకము[illegible] వ్రాయువారును నాటకముల నాడువారును నాటకములను [illegible]

కోరలేముగదా. ఉదాత్తభావములు ప్రచురపరచుటకునుగూడ తెలుపవచ్చును.

సంస్కృతములోఁదప్ప తక్కిన ప్రతీచీ భాషలలోఁ దుఃఖాంతనాటకములు ఎక్కువగ కలవు. కావలసినన్ని ఘోరవిపత్తులను మన మీప్రపంచమున ననుభవించుచున్నాముగదా. వీనివలన మనకు సౌహార్ద[illegible]వృద్ధి కాదా. తిరిగి దృశ్యకావ్యప్రపంచమునఁ గూడ నిట్టి సంతాపకారణంబులను గన మనమేల అపేక్షింపవలయును? భాషావిషయమున నిట్టి దుఃఖాంతవృత్తాంతములకు ప్రసక్తి లేకపోలేదు. చరిత్రకావ్యము నవలలున్నగు శ్రవ్యకావ్యములు వీనికిఁ జాలును. దృశ్యకావ్యములచే ఈ వైపరీత్యములను ప్రత్యక్షపఱచుట మేలా? సుఖాంతనాటకములు హృష్టియు, పుష్టియు, తుష్టియు నొసంగును. ఇట్టిభావములు అచ్చటచ్చట వినఁబడును.

శ్రీ అచ్యుతరావుపంతులుగారు ఆంధ్ర దేశమునందలి ముఖ్యరంగస్థలములను తెన్నుగ పరికించియున్నారు. ఆంగ్లమునను ఆంధ్రసంస్కృతములను వీరు ఉత్తీర్ణులు. వీరి ఆశయములు ఆదరణీయములు.

ఇట్టి విమర్శగ్రంథములు వీరు ఎక్కువగ ప్రకటించి ఆంధ్రమునకును ఆంధ్రులకును మేలొనరింపఁగలరు.

విజయనగరము,
14 మే 1926.

గి. సోమన్న.



# ఆంధ్ర నాటకములు

## 1 నాటకతత్త్వము.

శ్లో॥ "నాట్యం భిన్నరుచేర్జనస్య
బహుధా ప్యేకం సమారాధనమ్"

(కాళిదాసు.)

ఆంధ్రనాటక విషయములను గురించి యనేక మహానీయు లనేక విషయముల నిదివఱకు వార్తాపత్రికలమూలమున వెల్లడిపఱచియున్నారు. సామాన్యముగా నాటకముల ముఖ్యోద్దేశ మెద్దియో; నాటకములు వ్రాయుటలో ప్రాయశః వచనశైలియా, పద్యశైలియా, ప్రకృతిసిద్ధ మవి యుభయ శైలులను వాడుక చేయవలసిన వో నేది యెంతవఱకు కుపయోగింపవలసియున్నదియు; ఏయేసందర్భముల గద్యపద్యములు స్వభావసిద్ధము లగుననియు; ఇత్యాదివిషయములును, మఱియు భాషావిషయమున బాత్రముల కుచితమైన భాష నిర్ణయించుటయం దేయే సంగతులను ముఖ్యముగా మనము జ్ఞప్తియం దుంచుకొనవలయుననియు, పాత్రపోషణ కాలనిర్ణయాదుల నెట్లు చేయవలసియున్నదియు మున్నగువిషయములు వేర్వేఱభిప్రాయములకు హేతుభూతము లగుచున్నవి. ఈవిషయములను

గూర్చి నేనును నాకుఁ దోచిన సంగతుల నిక్కడఁ బొందు పఱచెద.

మానవజీవితాదర్శములు మానవకోటికి స్వభావసిద్ధముగను సోదాహరణముగను గనఁబఱచి మానవచిత్తప్రవృత్తులను శుద్ధిపఱచుటయే నాటకముల ముఖ్యోద్దేశము. ఇతిహాసపురాణాదులనుండికాని, చరిత్రములనుండికాని, భూతభవిష్యద్వర్తమాన సాంఘికబృందములనుండికాని కవికల్పనలనుండికాని మహనీయుల చరిత్రములను నిరూపించి తత్తద్వ్యాపారేతివృత్తములను మనకన్నులయెదుట నడపించి మన మనస్సులను రసభరితములుగఁ జేసి శుద్ధమగు జీవితాదర్శములను దెలుపుటయే నాటకముల ముఖ్యోద్దేశము. మానవజీవ చరిత్రములే నాటకములకు ముఖ్యాధారము లయ్యును నాటకములు కేవలము మానవ జీవచరిత్రములు కావు. జీవచరిత్రములలో నాయావ్యక్తులు వారివారి జీవితములయందు జన్మప్రభృతి మరణపర్యంతము చేసిన కార్యములను కాలానుక్రమముగా రచింపఁబడును. గ్రంథకర్త యెంతమాత్ర మాకార్యక్రమమును మార్చుటకు వీలు లేదు. నాటకము లన్ననో యాదర్శప్రధానములు గావునఁ గార్యక్రమము నొకించుక మార్చినను మార్పవచ్చును; నూతనపాత్రములను జేర్చినను జేర్పవచ్చును. లక్ష్యముగాఁ జేసికొనిన యాదర్శనములను నిరూపించుటయే ప్రథమకర్తవ్యము,

అనేకశతాబ్దములలోఁగాని యనేక సంవత్సరములలోఁగాని లేదా యనేకదినములలోఁ గాని జరగిన యితివృత్తములను మనకన్నులయెదుట మూఁడు నాలుగు గంటలలో జరుగునట్లు కనుపఱపవలసియున్నది. ముఖ్యాంశములనే తీసికొనినను కాలపరిమాణము చాలఁదక్కువగా నుండును గాన ప్రేక్షకులు దృఢభావనాశక్తి నైపుణిచే లుప్తభాగములను బూర్తిచేసి కథనంతయుఁ దదాదర్శనములను ద్యోతకము చేసికొనవలయును. ఈసంగతినే షేక్స్పియర్ మహాకవి యిట్లు నుడివియున్నాఁడు:—

"The best in this kind are but shadows—and the worst are no worse if imagination amend them.

చాలకాలమునందు జరిగిన సంగతులను కొలఁదికాలములో జరిగినట్లు నిరూపించుటచే మనము కాలప్రకృతికి కొంతవరకు వ్యతిరేకముగా నడచుచున్నాము. వేఱు వేఱు దేశములయందును వేఱు వేఱు స్థలములయందును జరిగినయంశముల నొక స్థలములయందు నిరూపించుటచే దేశప్రకృతికి వ్యతిరేకముగా నడచుచున్నాము. మఱియు నాయాచరిత్రాంశములు, మొట్టమొదట జరిగినప్పుడే యేపురుషులును స్త్రీలును జీవించియుండిరో, వారందఱును గతించినను వారిస్థానములయందు కొన్ని నూతనపాత్రములను గల్పించి యా యాఖ్యాయికలను మరల గోచరింపఁజేయుటచేఁ బురుషప్రకృతికి వ్యతిరేకముగా నడచుచున్నాము. ఇట్లు దేశకాలపాత్రములన్నిటియందును మనస్వకపోలకల్పనలచే నూతనసృష్టిఁ జేయు

చున్నాము. కావున నాటకములు భావనాజన్యములు కాని ప్రకృతి జన్యములు కావు. ఇవన్నియు భావనాప్రతిపాద్యము లగునప్పుడు పాత్రములు మాట్లాడెడు భాషమాత్రము భావనాప్రతిపాద్యము కాఁగూడదా?

నాటకములయందు వాడుకొనెడిభాష మనుష్యులు సామాన్యముగా మాట్లాడెడు భాషవలె వచనరూపముగా నుండవలెనుగాని, పద్యరూపముగా నుండఁగూడ దని కొందఱి యభిప్రాయము. వచనరూపముగా మాట్లాడుట మానవస్వభావముగాన నాటకములందును వచనమే యుండవలె నని వీరిసిద్ధాంతము. ఈసంగతిని గురించి యించుక విచారింతము.

మనుష్యులు మాట్లాడెడుభాష సాధారణముగా వచనరూపముగా నున్నను భాషాశైలి కొన్ని కొన్ని సమయముల యందు పద్యరూపము ననుగమించుచుండుట యెల్లరకు విదితమే. ఎట్లనఁ గోపము, శోకము, మోహము, విశ్లేషము, మొదలగు మనోవికారములను, హృదయస్పందనములను, వెల్లడిపఱచునపుడు మనుష్యుల భాషాశైలి లక్షణరహితమైన పద్యశైలిగా నుండు నని చెప్ప నొప్పు. మనయాదిమకవియగు వాల్మీకిమునియొక్క కోపస్ఫూర్తియే కదా ప్రథమ పద్యముగాఁ బరిణమించినది.

శ్లో॥ మా నిషాద ప్రతిష్ఠాం త్వగమః శాశ్వతీః సమాః ।
యత్క్రౌంచమిథునాదేకమవధీః కామమోహితం ॥

కావున రసవికాసమునకొఱకు భాషాశైలి మాఱుచునే, యుండును. రసజన్యములే సంగీతమును, కవనమునుగాన రసోత్కర్షమూలములుగా నాదస్వోద్బోధనముచేసెడు నాటకములయందు కవిత్వ, సంగీత, సాహిత్య సాహచర్యమేల గూడదు ? ప్రేక్షకులమనంబుల గొప్ప యాదర్శములం బలముగా నాటుకొనుటయే నాటకముల ముఖ్యోద్దేశము గాన నాయుద్దేశము నెఱవేర్చుట కనుకూల మగు సాధనము లన్నియు కర్తవ్యములే కవన నైపుణియు, గాన చమత్కృతియు, రంగస్థలాలంకృతియు, మున్నగు రసపోషణ విశేషము లన్నియు తగు సాధనములే, ఆకారణముననే కదా మహాకవి కాళిదాసిట్లు చెప్పినాఁడు.

శ్లో॥ఆపరితోషాద్విదుషాం, న సాధు, మన్యే ప్రయోగవిజ్ఞానం
బలవదపి శిక్షితానా మాత్మన్యప్రత్యయో చేతః॥

రసపోషణ సంవిధానము సాధనము; ఆదర్శము సాధనీయము. సాధనసామగ్రియం దుత్తమము కవితామాధుర్యము. కావున నాటకరచనయందుఁ గవితామాధుర్యద్యోతకంబగు పద్యశైలియే ప్రధానము తత్కారణముననే సమస్తదేశంబులయందును మహాకవులు, నాటకములయందుఁ బద్యశైలినే యుపయోగించిరి. అయిన నక్కడక్కడ వచనభాగములుండవచ్చును. రసోత్పత్తికిఁ బ్రధానములు కానిచోటులయందు కథాక్రమమున కనుబంధములుగానుండు తావులయందును నీచపాత్రములు సంభాషించెడు పట్టులయందును

మున్నగు స్థలములయందు వచనశైలియే యుండఁదగిన దని తోఁచుచున్నయది.

సంస్కృత భాషయందు దప్పఁ దదితరభాషలయందు అనగా, లాటిన్, గ్రీక్, ఫ్రెంచి, జర్మను, మొదలగు భాషల యందు రచింపఁబడిన నాటకములలో స్త్రీలుసహితము పద్యశైలినే మాట్లాడుట యాచారము. సంస్కృతభాషయందు మాత్రమె స్త్రీలు పద్యశైలిని మాట్లాడఁ గూడ దని విచిత్రనియమము విధింపఁబడుట పరిశోధనీయమయిన సంగతి యయినను ప్రస్తుతాంశము కాదు కావున విపులవిచారణ చేయక విడువఁబడినది.

నాటకములయందు పురుషులును స్త్రీలును, సమాన ప్రాముఖ్యమునకుఁ బాత్రము లగుపాత్రములే. నాయకుఁ డెంతమాననీయుఁడో నాయికయు నంతమాననీయురా లనియే నానమ్మకము. తపోత్కర్షమునకును అదర్శసూచనకును నాయకుని వేషభాషావర్తనము లెంతముఖ్యములో నాయికయొక్కయు వేష భాషా వర్తనము లంతముఖ్యములే; నాయకుని పాత్రపోషణ మెంతకర్తవ్యమో నాయికయొక్కయు పాత్రపోషణ మంత కర్తవ్యమె. అట్టితటి రసోద్రేకము మగు కవితామధురిమ నాయకునకేకాని, నాయిక, కనావశ్యకమని చెప్పుట కేవల మన్యాయము. ఉభయుల ముఖములయందును, గాన విలాసిత నృత్య పద్య ప్రవచన చమత్కృతి సమానముగాఁ బాటింపవలె నొప్పు.

ఆంధ్రనాటకములయం దాంధ్రేతరపాత్రము లెట్టిభాషను మాట్లాడవలె నని యిటీవల కొంతచర్చ జరుగుచున్నది. అనఁగా తురకలు మనరంగస్థలములందు మాట్లాడునపుడు యెటువంటిభాష మాట్లాడవలయునో యాంగ్లేయులు,మనరంగస్థలముయం దున్నప్పు డెట్టి భాష మాట్లాడవలెనో, మొదలగు సమస్యల్ను, నిర్వచనము చేయఁబడుచున్నవి. ఈసమస్యలను గుఱించివ్రాసినవారందఱేకగ్రీవముగా నొక్కసంగతి మాత్రమంగీకరించిరి. అదేదన;--ఆంధ్రనాటకములయం దేయేజాతివారు వచ్చినను,ఆంధ్రభాషనె మాట్లాడవలయును గాని, యితరభాషలను మాట్లాడఁగూడ దని సిద్ధాంతము చేయఁబడినది. అనగా తురకలు కేవలము,తురకమే మాట్లాడఁగూడ దనియు, ఆంగ్లేయులు, ఇంగ్లీషుభాషను మాత్రమే మాట్లాడఁగూడదనియు, ఫ్రెంచివారు ఫ్రెంచిభాషనుమాత్రమే మాట్లాడఁగూడదనియు, వీరందరు తెలుఁగుభాషయుందేమాట్లాడవలయుననియు నందఱు నమ్మతించిన విషయమె. అయినను వీరందఱు మాట్లాడెడి తెలుగుభాష యెట్లుగా నుండవలెను? ఇందునుగుఱించి వేఱువేఱభిప్రాయములను వేఱువేఱు రసజ్ఞులు వక్కాణించిరి. ఏయేజాతివారు, మన తెనుఁగు నెట్లెట్లుమాట్లాడుదురో యారీయావిధమయిన పరిభాషనే మాట్లాడించుట స్వాభావికముగానుండు నని కొందఱిమతము; అనఁగా తురకలు తెలుగు మాట్లాడునప్పుడు వ్యాకరణము నందును, ఉచ్చారణ యందును ఏవిధమయిన వైచిత్ర్యములను గనుపించెదరో, ఆవైచిత్ర్యముల

తో గూడ తురకలపాత్రములు ధరించెడు వారిచే మాట్లా డించుట స్వభావసిద్ధమని వారియభిప్రాయము.అలాగున అం గ్లేయులు తెలుఁగు మాట్లాడునప్పుడు యేయేటువంటి పారిభాషిక ములను, అపభ్రంశముల నాభాసముల నుచ్చరించెదరో,వానిని జాగ్రత్తగా సేకరించి, నానావిధమైన యాంధ్రభాషను రంగ స్థలములయందు మాట్లాడించుటయే యుక్తమని వీరినాతము. ఈలాగుననె ఫ్రెంచివారును, జర్మనులును, జపానువారును, పాత్రములగునప్పు డనుష్ఠింపవలయును.

ఈవిషయమును గూర్చి మరియొకరు వ్రాసిన యభి ప్రాయ మేదన;--కొన్ని ప్రాంతములలో నున్నతురకలు స్వచ్ఛ మయిన యుచ్చారణతో వ్యాకరణయుక్తముగ తెలుఁగు మాట్లాడుట యున్నది గాన, తురకలు రంగస్థలమునందు శుద్ధ మయిన తెలుఁగును మాట్లాడుట కర్హులు.అటులనెకొంతమంది యింగ్లీషువారు శుద్ధమయిన తెలుగు నేర్చుకొని బ్రౌనుదొర గారివలె తెలుగునందుఁ గవిత్వము చెప్పుటకును సమర్థులుగా నున్నారు గాన యింగ్లీషువారునుగూడ శుద్ధమైన తెలుఁగును మాట్లాడుట కర్హులు. అనఁగా నీపండితుల యభిప్రాయ మిట్టిదని తోచుచున్నది. ఇతరదేశస్థులు మనదేశములో నివ సించి తెలుఁగు మాట్లాడుటయందలవాటు చేసికొని,పయిగా, తెలుగువారివలె సరియయిన యుచ్చారణయు, వ్యాకరణనియ మములను పాటించినయెడల వారు రంగస్థలములందు నుంచి తెలుఁగు మాట్లాడుట కర్హులు. వ్యాకరణోచ్చారణాదుల

యందు గొందఱయినను సుశిక్షితులు కానియెడల వారు మిశ్రమముగ తెలుగు మాత్రమే మాట్లాడుట కర్తవ్యమని తేలుచున్నది. అయితే మన యాంధ్రదేశమందునికి కెన్నఁడు నవకాశములేని యితరజాతులవారి విషయములో నేను జేయఁదగి యున్నదియు తెలియరాకున్నది. గ్రీసుదేశపు కథలను, రోము దేశపుకథలను, అమెరికాదేశపుకథలను ఇత్యాది యితరదేశపుఁకథలను మనము నాటకములుగా వ్రాయవలసినచో ఆయా పాత్రముల కెట్టిభాష నియ్యవలెను? ఆజాతులవారు మనదేశములో నెప్పుడయిన నున్నదియు, వారెట్లు తెలుగు మాట్లాడినదియు మనకెంతమాత్రము తెలియదే? ఇంక కొన్నిజాతులవారు మన తెలుగుదేశము నెన్నఁడును చూచుటయును లేదే? ఇట్టి జాతులవారు మన రంగస్థలములయందే యేభాషమాట్లాడవలెనో యెట్లు మాట్లాడవలెనో తెలియరాకున్నది. కావున నీపండితులు కనుపర్చిన హేతువులను వీరు చేసిన సిద్ధాంతములను మనము సరకుచేసిన యెడల మననాటకములు కేవలము సందర్భములకును హాస్యములకును ఆభాసములకును ఆస్పదములగును.

కాని యీవిషయములో మనకర్తవ్యమెద్ది? దీని గురించి నాయభిప్రాయము నిక్కడ జెప్పుచున్నాను. ఏజాతివారయ్యను, ఏభాషవారయ్యను, తెలుగునాటకములలో ప్రదర్శింపబడువారగాన తెలుగుభాషనే మాట్లాడుచు వారి వారి గౌరవమునకు దగినట్లుగా మాట్లాడుటయే ప్రధానాం

శము. రాజు మాట్లాడెడిభాష సేవకుడు మాట్లాడగూడదు సేవకుడుమాట్లాడెడుభాష రాజు మాట్లాడగూడదు. ఎవరిస్థితికి తగినభాష వారుమాట్లాడట యుచితము. ఈవిషయమునందు దేశభేదములకును భాషాభేదములకును తావులేదు. మన తెలుగురాజు మాట్లాడినను, తురకరాజు మాట్లాడినను ఇంగ్లీషురాజు మాట్లాడినను, ఈజిప్టురాజు మాట్లాడినను, శైలి యొక్క ఔచిత్యముగ నుండవలెను. శబ్దగౌరవము. భావగాంభీర్యము. ఉచ్చారణ విస్ఫుటత, ఇత్యాది, మహాపురుష మానసికలక్షణ ము లేక స్పష్టముగా వర్తింపవలయును. అలాగునే మన దేశపుసేవకుడు మాట్లాడినను జపాను దేశపుసేవకుడు మాట్లాడినను, రష్యాదేశపుసేవకుడు మాట్లాడినను ఒకేవిధముగు శైలినియుపయోగింపవలయును. గ్రామ్యపదము లెక్కువగానుండుటయు, ఉచ్చారణయందు దోషములను, ముఖ్యముగ నీచపాత్రోచితాభాషణములు, నైసర్గికములు, ఈరీతిగనే యితరపాత్రముల గురించియు నిర్ణయించుట సమంజసము, మహాకవుల కృతులలోని నాయకుల నతిక్రమింపలేము. ఇంగ్లీషు వాఙ్మయమునందలి హామ్లెటు, ఔరంగజేబు నాటకములు జర్మను భాషయందలి "ఫాస్టో" మైడు, ఆఫ్ ఆర్లిన్సు మున్నగు నాటకరాజములు లీలాగుణ ప్రాయము బడిసినవి.

ఇంతవరకు భాషావిషయములకూర్చియే పర్యాలోచించితిని. మానసిక వ్యాపారముల, గుణాగుణంబు లనుల వ్యాకరంబులును, ఏకైకస్థానములు నగు ఆదర్శములు, అభిప్రాయ

ములు, భావములు, కల్పనలు, రాగరసంబులు, ఉపమాతిశయోక్తివర్ణన శమత్కృతులు మున్నగు మానసిక హృదయిక విశేషంబులు, ప్రతిమనుష్యునియందు వేరువేరుగానుండును. ఆంగ్లేయదేశపు రాజుయొక్క మానసికోన్మీలనము [mental development] ఆంధ్రదేశపురాజుయొక్క మానసికోన్మీలనమును బోలియుండదు. రుష్యాదేశపురాజుయొక్క మానసికకృషి జపానుదేశపు రాజుయొక్క మానసికకృషికి సరిపోదు. ఈరీతిగ నితరపాత్రములయందును దేశకాలపాత్రములబట్టి మానసిక, హృదయిక, భేదంబు లాపాదితంబులగు ఈదృశభేదంబులు సమానపాత్రంబులయందుం గాన్పించును గాన ఆయాభేదంబులు గనుపరచుచు భాషాశైలిమాత్రము, సామాన్యముగా నుచ్ఛ నీచప్రమాణంబులను వర్తింపవలయును.

ఆంధ్ర వాఙ్మయమునం దీకాలము నవలలయొక్కయు నాటకములయొక్కయు మహాయుగమని చెప్పనొప్పు. ఏలయన నితర వాఙ్మయ భాగములకంటె సామాన్యముగ నవలలును నాటకములు నెక్కువగ వ్రాయఁబడుచున్నవి. మన వాఙ్మయము దేవిమమూలకయినను గీర్వాణవాఙ్మయము మాతృకయయ్యు నాటక నవలావిషయములలో మాత్ర మీయాచారము భేదించుచున్నది. సంస్కృత నాటకములు సుమారు రెండువేల సంవత్సరములనుండి మనదేశమందుండియు విశేషతః ఆంధ్రదేశమునఁ బది పన్నెండువందల సంవత్సరము

లనుండి చదువఁబడుచుండియు నాంధ్రభాషలో మాత్రము గత శతాబ్దము వఱకు నిజమైన నాటక మొక్కటియుఁ గానరాకుండుట యందఱకు నచ్చెరువు గలిగించుచుండిన విషయమే. సంస్కృతనాటకములను బండితులు చదివి సంతోషించిరే గాని వానిని మన భాషలోని కనువాదించుటగాని యనుకరించుటగాని జరుపకైరి. దీనిని గుఱించి పలువురు పలువిధములైన యభిప్రాయములను జెప్పిరి గాని ముఖ్యముగా నాసృష్టికిఁ దోఁచిన కారణమేమన మన వాఙ్మయములో సంస్కృతమునందుగాని మఱి యేహైందవభాషయందుఁగాని ప్రౌఢ నూపని ప్రబంధ స్వరూప ముత్పత్తియగుటయే యని చెప్పఁదగినది. మన ప్రబంధములు సంస్కృత నాటకములకును సంస్కృత కావ్యములకును మధ్యవర్తులు. వీనియందు నాటకముల యొక్కయుఁ గావ్యముల యొక్కయు లక్షణములు సామాన్యముగ నుండుటచే వేఱుగా నాటకముల వ్రాయు నవసరము లేకపోయినది. ఇటీవల నాంగ్లేయ వాఙ్మయము నందలి యనుభవము గలిగిన కొలఁది యాభాషయందున్న నవలలను నాటకములను మనవారు చదివి యామూర్తులను బట్టి ప్రతిమూర్తులను సృష్టింప నుద్దేశించిరి. అందుచేత నే మొట్టమొదటనుండియు దెలుఁగు నాటకముల రచించిన వారాంగ్లభాషాభ్యాసకులయియున్నారు. నాటకరచనోద్దేశ్య మాంగ్లభాషాస్ఫురిత మైనను నాటకరచన మాత్రము కేవల మాంగ్లభాషా జనితము కాదు, ఏలయనఁ దెలుఁగు నాటక

ములు వ్రాసినవారు సంస్కృత నాటకజ్ఞానము గూడ సంపా దించి యున్నవారే. కాబట్టి యాంధ్రనాటకములు కేవల మాంగ్లేయ నాటకముల పోలికను బొందకయు సంస్కృత నాటకముల పద్ధతుల ననుసరింపకయు మధ్యమార్గములం దొక్కి యొక మిశ్రమాకారమును వహించినవి. కథాసం విధానమున సంస్కృత నాటకములను రూపనిర్మాణములో నాంగ్లేయ నాటకములను బోలియున్నవి.

ప్రప్రథమమున నాంధ్రనాటక రచనకుఁ గడంగిన మహానుభావుల దృష్టికొక గొప్ప వాఙ్మయ సమస్య గాన్పిం చినది. ఒక్కవైపునఁ దెలుఁగు ప్రబంధములు. మఱియొక వైపున సంస్కృతనాటకములు. వేఱొక దిక్కున నాంగ్లేయ నాటకములు. ఈ మూటి ప్రకృతులు వారి భావ నైర్మల్య మునుఁ గలగుండు పరిచినవి. ఈ మూఁడు విషయములలో దేనినిఁ ద్రోసివేయుటకును వీలులేక తుదకీ మూటికిని సమన్వ యము చేయవలసి వచ్చినది. ఆకారణమున మొదటి తెలుఁగు నాటకము లీ మూటియొక్క యాభాసములుగాఁ బరిణమించి నవి. శైలియందుఁ దెలుఁగు ప్రబంధములను కథాపోషణయం దును నంగ నిర్మాణము నందును సంస్కృత నాటకములను భావభావనా విస్ఫురణయందు నాంగ్లనాటకములను ననుసరించి యున్నవి. క్రమముగాఁ బ్రబంధశైలిని విడనాడి సామాన్య నాటక శైలిని గ్రహించినను గీర్వాణ నాటకముల యొక్క

యు నాంగ్లనాటకములు గయొక్కయు పోలిక లిప్పటివఱకు మన నాటకములం బొందింపఁబడియే యున్నవి.

ఆంధ్రనాటక చరిత్ర వ్రాయునపుడు ఆంధ్ర నాటకముల యుత్పత్తి విషయములో బళ్లారియను రాజమహేంద్రవరమును నగరస్థానములు బొందియున్నవని చెప్పవలసి యుండును. ఈ రెండు స్థలములలోను గొంచె మెచ్చుతక్కువగా సమకాలమందుననే నాటకరచనా ప్రయత్నములు జరిగినవని చరిత్రాన్వేషణమునఁ దెలియుచున్నది. అయినను రచనా పద్ధతులు మాత్ర మీ రెంటియందును వేర్వేఱయ్యెను. బళ్లారియందలి మహానాటక నిర్మాతలగు కృష్ణమాచార్యుల వారును శ్రీనివాసరావుగారును దమ నాటకములఁ జాల వఱకుఁ బ్రబంధశైలిని వ్రాసియుండిరి. పద్యములనటులనే సంభాషణలు వర్ణనలు గూడ సంస్కృతపదభూయిష్ఠము లైన దీర్ఘసమాసములతో నిండియున్నవి. మధ్యమధ్య సొడ్డైన రగడలు దండకములు నిత్యాదిప్రబంధ సూచకములగు కవిత్వ ధోరణులు యథేచ్ఛముగాఁ బ్రయోగించియున్నారు. కావున నా నాటకములు యథారూపముగా రంగస్థలమందుఁ బ్రయోగించుట కష్టమగుటయేగాక సామాన్యజనులు సూక్ష్మముగా గ్రహించుటయుఁ గూడ నసాధ్యమే. వీరేశలింగ మనుపేరుగల రాజమహేంద్రవరమునందుత్పన్నమైన నాటకములు ప్రథమమునుండియు జనసామాన్యమున కతిశయము గొప్పదైన సులభశైలిని వ్రాయఁబడియుండెను. ఇట్టి రచనయందు

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు రసగ్రాహ్యులని యాంధ్ర లోకమంతయు నెఱింగిన విషయమే. వీరి నాటకములన్నియు ముఖ్యతః వీరి గయోపాఖ్యానము సామాన్యజనులకు సులభ గ్రాహ్యమై యాహ్లాదము గలిగించెడి శయ్యాపాకరీతుల రచింపబడి నట్లాంధ్రలోకమంతటను విదితము. * కందుకూరి వీరేశలింగముగారు సహితము చాలవఱకు దమనాటకములను గడు సులభశైలిని వ్రాసియున్నారు. వారి తర్వాత వచ్చిన నాటకగ్రంధకర్తలందఱు సామాన్యముగా నొంటి ప్రబంధ శైలిని విడనాడి, కేవలము పఠింపని గ్రామ్యప్రకృతిని వైకొన కయు,మధ్యమార్గానువర్తులై యాంధ్రనాటకమున కుచితమైన శైలిని నిరూపించిరి. తిరుపతి వేంకటేశ్వరకవులు నాటకములు వారి తక్కిన కవనములవలె జనసామాన్యమునకు వంద్య ములు సులభగ్రాహ్యములు.

శైలివిషయములో మన నాటకములందంతే చర్చనీ యాంశములు లేకపోయినను గొంతమంది విమర్శకులు తక్కిన వాఙ్మయస్వరూపముల వలెనే కేవల గ్రామ్యభాషా ప్రయు క్తములయియుండవలెననియు మఱికొందఱు కేవలము గద్యా త్మకములుగ నుండవలెననియు చిత్రవిచిత్రాభిప్రాయములు వెల్లడించుటయుఁ గలదు. కాని ప్రపంచమందలి ప్రతిదేశ ముందును ప్రాచీనకాలము నుండియు నిప్పటివఱకుఁ బ్రసిద్ధిఁ

* కొన్ని భాగములు మాత్రము కేవలము ప్రాకృతజనుల కాహ్లాదము పుట్టించెడు రీతిని వ్రాయఁబడినట్లు గానిపించును.

జెందిన నాటకరూపముల యనుభవము లే యభిప్రాయము లను వేనోళ్ల ఖండించుచున్నవి. అట్టి విపరీతాభిప్రాయము లకుఁ బ్రపంచానుభవమే సరియగు ప్రత్యుత్తరమనితలంచెద.

సంస్కృత నాటకముల నిర్మాణము మున్నగు విషయ ముల నిర్ణయించెడు లాక్షణిక గ్రంథములు చాలవరకా భాష యందున్నవి. కాని యాంగ్లేయ నాటకముల నిర్ణయించెడు లక్షణగ్రంథము లాభాషయందుఁ గొలఁదిగ మాత్రము గాన్పిం చుచున్నవి. ఆకారణమున నాంగ్లేయనాటకము లిప్పటికిని నిరర్గళపద్ధతుల విజృంభించుచున్నవి. అంకనియమము తప్ప నితరనియమములు సామాన్యముగఁ గానరావు. గ్రంథకర్త యొక్క మనోభావములు నైసర్గికముగ వికసించి యథేష్టరూ పములఁ బెంపొందుట కేవిధమగు నాటంకము లుండవు. మానవజాతియొక్క నానారూపసౌందర్యము వానియందు సురుచిరముగఁ గానంబడును.

మన తెలుఁగు నాటకముల కిప్పటివఱకు లక్షణగ్రంథ ములలేమి యొక మహాభాగ్యమని నాతలంపు. ఈభాగ్యము చిరకాలముండుఁగాక. సంస్కృత నాటకవిధానమును దెలుఁ గులయందుఁ జొప్పించుటకు విద్వాంసులు చేసెడు ప్రయత్న ములు వాని కంతగా మేలొనర్చనవి గావని నాయభిప్రాయ ము. తెలుఁగునాటకములను దేశకాలపరిస్థితులకనుగుణ్యముగా వృద్ధినొంద నిచ్చుటయే ముఖ్యకర్తవ్యమని నాయాశయము. శుద్ధవిష్కంభములు మిశ్రవిష్కంభములు నిత్యాదిసంస్కృత

నాటక నియమములతో మనకుం బనిలేదు. విస్తృతికి నవకాశము పెరిగిన కొలందిని విస్తృతి విజృంభణములుగూడం బెరుగుచుండును గాన సూక్ష్మనిబంధనలకంటె స్వాతంత్ర్యమే యెక్కుడు మేలొనర్చును.

ఇంక నాటకకథల విషయమై యొకింత చెప్పి యీవిభాగము ముగించెద. మన నాటకకథలు సర్వసామాన్యముగ భారతరామాయణములు నష్టాదశపురాణములుగా నుపపురాణములు స్థలపురాణములు మున్నగు గ్రంథములనుండి తీయంబడుచున్నవి. అందువలనం గొన్ని లాభములును గొన్ని నష్టములునుగూడ గలుగుచున్నవి. మన హైందవజాతీయత నిల్చుటయు దైవభక్తి కుదురుటయు పతిభక్తికాదర్శములు నెలకొల్పుటయు మొదలగు లాభములున్నను జనసామాన్యమునకు నిజమగు దేశచారిత్రకజ్ఞానముగాని ప్రపంచజ్ఞానముగాని కలుగుట కవకాశము లేకున్నది. ఎల్లప్పుడును సీతారాములు సావిత్రి శకుంతల హరిశ్చంద్రుండు మున్నగువారి కథలే యనేకవిధములం బరివర్తింపంబడి నాటకరూపములుగా వ్రాయంబడుచున్నవి. వీనివలన స్త్రీపాతివ్రత్యము, జీవితమందలి యాత్మత్యాగోత్కృష్టత మున్నగు హిందూధర్మ నియోగములు నిరంతరము మనకన్నులయెదుటం గట్టంబడుటచేత మన జీవచారిత్రములు ఎల్లప్పుడును నాకాశగమన సంచారులవలెను లాపుట్యా (Laputa) దేశస్థులవలెను ప్రపంచాతీత

భావములను మాత్రము పరిగణించుచున్నాము. మనమీ మానవ ప్రపంచమందు నివసించుటచేతను మానవకోటిలో మెలఁగుచుండుటచేతను మనవలన దేశమునకుఁ బురోవృద్ధి గలుగవలసి యుండుటచేతను మనకు మానవకోటికి సంబంధించినయుదంతములే యెక్కుడుగ రచింపవలెను. పోప్ (Pope) మహాకవీశ్వరుఁడు "The proper study for mankind is man" అని చెప్పియున్నాఁడు. మనుష్యస్వభావములను మనుష్య భావభావనములు మనుష్యవికాసములును నానాదేశములలో నానాకాలములయందేయుఁ గలిగిన మార్పులను నిరూపించుటచేత జనసామాన్యమునకుఁ గలిగెడు మనోవికాసము జాతీయవృద్ధికిని దేశాభివృద్ధికిని తోడ్పడక మానదు.

అతిలోకములగు స్త్రీపురుషులను వర్ణించుటలో రెండు కష్టములున్నవి. దైవసమానులను మనుష్యసమానులుగా నిరూపించుట (Anthropomorphism) యొక కష్టము మానవప్రవృత్తులలోఁ బడలేకనియున్న మనకు నతిలోక స్త్రీ పురుషుల భావవికారములను సరిగా భావించుకోలేము రెండవ కష్టము. ఈ రెండుకష్టములవలనను గవీశ్వరులు తమగ్రంథములయందనేక లోపములఁ జేయుచున్నారు.

నాటకములు కొంతవఱకు మహాప్రపంచమునకు సరిఁ జెందియున్నవని యీవఱకే చెప్పియుంటిమి. దేవతలు రాక్షసులు గంధర్వులు నిత్యాద్యతిమానుష స్త్రీపురుషులను గుఱించి వర్ణించుటచేత నయ్యూహాప్రపంచమును [illegible] రూపా

ము గాఁ జేయఁబడుచున్నది. ఆ కారణముచే నాటకప్రేక్షకులు భూమికిం జెందక యాకాశమునకుం జెందక మధ్య నంతరాళ మున ద్రిశంకునివలె నూఁగులాడుచుందురు. కవులన్ననో విశృంఖలులై స్వేచ్ఛావిహారులయి యీ యతిమానుషపాత్ర ముల యథేష్టముగా వర్ణింతురు. కొంద ఱుత్కృష్టముగాను కొంద ఱతినికృష్టముగాను వర్ణించుచుందురు. కావున నియ మాన్వితులగు వాఙ్మయ రసికనతంను లేవగించుకొని నిరుత్సా హులగుచున్నారు. ఇట్టి దురవస్థ యీ మానవప్రకృతియుత మగు ప్రత్యక్షప్రపంచమును బోనాడుటవలననే కలుగు చున్నది.

మానవప్రకృతిని వర్ణించుట యెంత్యుగుకష్టమని యెల్ల రకుం దెలిసిన విషయమే. ఏలయన మానవలక్షణములు వివిధజాతులలో వివిధదేశములలో వేఱ్వేఱు రూపములఁ దాల్చి యుండుటచే నాయాలక్షణముల గ్రహించినఁగాని నిజముగా గ్రంథకర్త వానిని గుఱించి వ్రాయలేఁడు. ఇట్టి గ్రహణశక్తి యనుభవశాలురకే గాని యలవడదు. కావున నల్పవయ స్కులు మొదలగువారు నాటకరచనకుఁ గడంగిన దో నడుగడు గునకుఁ దడఁబడుచుందురు. అట్టి యనుభవహీనులు వ్రాసిన గ్రంథములు రసహీనములై తేలికగానుండి ప్రజలకు రోఁత పుట్టించును. ఆహేతువున సాహిత్యాంతమగు నాటకము పసిబాలుర చేతులలోఁ బడి చెడిపోవుటయుఁ దటస్థించును. కావున నీముప్పుఁ దప్పించి నాటకముల నెప్పుడు నున్నతపద

గిని నిల్పుటకు మహానుభావులై మానవ చరిత్రలను రూపక ములుగ వ్రాయుట యుత్తమము. ప్రేక్షకులన్ననో యీ మానవ ప్రపంచములోఁ బుట్టిపెరిగి గిట్టిన తమ తోడివారల పాత్రములచే నలరారు నాటకములఁ జూచి తమలోని భావ వికారము లాయా పాత్రములయందుండుటచే తమ్ముఁ దామే యంతర్ముఖులై చూచుకొందురు. ఆహేతువునలనఁ దనమా నసములను గొంతవఱకు బరిశోధించుకొని దిద్దుకొనఁగలరు. నాటకములయొక్క ముఖ్యోద్దేశ మింతవఱకునఁ దప్పక నెరవేఱును.

కావున నాయూహయిది యేమన:—మనము నివసించి యున్న యీచరాచరయుక్తమగు ప్రపంచమును నిజముగ వర్ణించి మన దేశీయుల కన్నులకుఁ గట్టినట్టుల ప్రకృతిని బ్రద ర్శించుట ముఖ్యావసరము. అట్లు చేయుటలోఁ గూడ జనసా మాన్యముయొక్క యూహాశక్తుల పరిమితినిగూడఁ జూడవల యు. వారి యూహకు మించిన ప్రయోగములు నిరుపయోగ ములు. కాబట్టి మన యాంధ్రదేశచరిత్రను బరిశోధించి కాని మన ప్రాక్ఖండచరిత్రలను బరిశోధించికాని మన భారత దేశ చరిత్రను బరిశోధించికొని వ్రాసిన నాటకములు మన దేశీయులకు సూహ్యములై గ్రాహ్యములై రుచిఁ బుట్టించి వారియొక్క బుద్ధి వృద్ధులకుఁ దోడ్పడి వారియందు నాగరిక తయును మానసోన్నతియును బెంపొందింపఁ జేయఁగలవు. ఈపద్ధతు లిటీవలఁ గొంతవఱ కాచరణలోనికి వచ్చుచున్నవని

సంతసించుచున్నాము. కోలాచలము శ్రీనివాసరావుగారు వ్రాసిన "రామరాజు" వారణాసి శ్రీనివాసరావుగారు వ్రాసిన "రక్తబలి" కొప్పరపు సుబ్బారావుగారు వ్రాసిన "రోషనారా" మున్నగు నాటకములు నూతన మార్గములఁ ద్రొక్కుచున్నవి. ఇట్టి గ్రంథములింకను వేనవేలీ యాంధ్రప్రపంచమున వెలసి మన ప్రజలకు దేశభక్తిని చరిత్రజ్ఞానమును గలిగించుఁగాత!

---

N. B. ఈ రెండవ అధ్యాయమునకు శీర్షికశ్లోకముగా యీ క్రిందిశ్లోకమును గ్రహింపవలయును.

శ్లో॥ "ఔచిత్యం వచసాం ప్రకృత్యనుగతం సర్వత్ర పాత్రౌచితీ
పుంభిః స్యాదనవద్యతా? రసస్య చ కథామార్గే చ జాతిక్రమః
శుద్ధిః ప్రస్తుతసంవిధానకవిధౌ ప్రౌఢిశ్చ శబ్దార్థయో
ర్విద్వద్భిః పరిభావ్యతా మనహితైరేతావదేవాస్తు నః"

[భోజుఁడు.]



# 3 పాత్రపోషణము.



శ్లో॥ నానాశీలాః ప్రకృతయః శీలే నాట్యం ప్రతిష్ఠితమ్।
తస్మాల్లోకప్రమాణం హి నాట్యం జ్ఞేయం ప్రయోక్తృభిః॥
[భరతముని నాట్యశాస్త్రము.]

నాటకములయందు వచ్చెడిపాత్రములు సామాన్యముగ మూఁడురకములక్రింద నేర్పఱుపవచ్చును.

1 ప్రకృతిసిద్ధములు, 2 పురాణసిద్ధములు, 3 కల్పితములు.

1 ప్రకృతిసిద్ధములు:-

మానవకోటియందు జాతిభేదములఁబట్టియు, దేశ కాల భేదములఁబట్టియు, వృత్తిభేదములఁబట్టియు, మనుష్యసంఘముల ప్రకృతులు కొంతవఱకు, వేఱువేఱుగనుండును. అయినను నొకానొక దేశమందున్న వారియందుఁ గొన్ని సామాన్యగుణములును, యొకానొకజాతివారియందు గొన్నిసామాన్యలక్షణములును కాన్పించుచుండును. అట్లే యొకానొకవృత్తి నవలంబించినవారియందుఁ గొంత గుణసాదృశ్యము గలుగుచుండును. ఈసాధృశ్యభేదములను సూక్ష్మదృష్టితో నారసి సమన్వయించి విశేషముగ ప్రకృత్యనుభవజ్ఞానము సంపాదించినవాఁడే నాటకముల వ్రాయుటకుఁ గడంగవలయును, ఇట్టియను

భవజ్ఞానము లేని బాలుఁడు కాని పరిశీలనదృష్టి లేని వృద్ధుఁడు కాని రచించిన గ్రంథములయందుఁ బాత్రౌచిత్యమంతయుండుట కవకాశము తక్కువ. ప్రకృతినిర్దిష్టములగు పాత్రములయందుఁ బ్రకృతిలక్షణములు గాన్పించనియెడలఁ బ్రకృతి నన్వేషించి సాధించుటవలనఁ గలిగెడి యాహ్లాదము మనమనంబులయందుఁ గలుగుట దుర్లభము. అట్టియాహ్లాదము గలుగని యా నానాటకములు నీరసములనియు, అస్వాభావికములనియు నిరసించుదుము. ఈవిషయమునే షేక్స్పియరు మహాకవియిట్లు చెప్పియున్నాఁడు. "The purpose of a play is to hold, as it were, the mirror up to Nature; to show virtue her own feature, scorn her own image and the very age and body of the time his form and pressure."

కావున ప్రకృతిప్రపంచమునుండి తీసి కనుపఱచిన పాత్రములు ప్రకృతిసిద్ధములుగ నుండవలెను. బహిరాకారములును, మనోభావములును, సమానముగనే ప్రకృతియందుఁ బ్రతిబింబితములుగ నుండనోపు, సులక్షణాకృతుల నాదర్శనిష్పత్తి కనుకూలముగఁ జేర్చి చిత్రించిన యా నాటకగౌరవము చెడదును. అవలక్షణవికారములను మాత్రమే స్వీకరించి హాస్యజనకములుగ నుండునట్లు ప్రదర్శించినట్లయిన నానాటకములు తేలికగానో ప్రహసనములుగా నుండును. కాని యుభయవిషయములయందును ప్రకృతియొక్క ప్రతిఫలనము సమానముగనే యుండును. అయినను యీదేశభేదముచే గుణప్రదర్శనభేదము గలుగుచున్నది.

నాటకములయందలి పాత్రములగుణపోషణఁ జేయుటకు గుణవర్ణనఁ జేసినమాత్రమునఁ జాలదు. అనఁగా నొకానొక పాత్ర మిట్టిట్టి గుణములు గలవని యాయాగుణముల పట్టిక వ్రాసినసరిపోదు. ఆయాగుణముల విశదీకరించు నవస్థలఁ గల్పించి యితరపాత్రముల సంభాషణలచే నభివర్ణనఁ జేయించి ప్రదర్శించుట యుక్తమగుపద్ధతి. ఈయవస్థలను కల్పించుటయం దుచితానుచితములను సందర్భాసందర్భములను గుర్తెఱుఁగవలెను. శ్రీరాముఁడు దొంగవాఁడు కాఁడని తెలియఁజేయుట కాతనిని దొంగలగుంపులోఁ జేర్చి వారు చేయు క్రూరకృత్యముల నాయనచే దూషింపఁజేయుట పరిహాసాస్పదమగు పద్ధతిగాని, ప్రశంసనీయమగునది కాదు. ఏలయన, శ్రీరాముఁడు ధూర్తుఁడు కాఁడని నిర్వచనము చేయుటకు నవసరంబెద్ది? ఆయనయందు ప్రతిదోషగుణము లేదని ప్రత్యేక దృష్టాంతపూర్వకముగఁ జూపినఁగాని, ఆయనమాహాత్మ్యమునకు గొఱంత గలుగునా? ప్రతిమహానుభావునియందును సుగుణములన్నియు నున్నవనియు, దుర్గుణము లెవ్వియు లేవనియు, ప్రత్యేకముగా నిదర్శనములఁ గల్పించి చూపనుద్దేశించిన గ్రంథము నాటకమనఁదగినది కాదు. నిరుపయోగమగు పత్రసముదాయమని చెప్పనొప్పును. ఒకానొకనాటక గ్రంథకర్త శ్రీకృష్ణునిఁ గూర్చి వ్రాయుచు నామహానుభావుఁడు దక్షిణనాయకుఁ డయినను ఆయనదాక్షిణ్యములో నుచితానుచిత పరిజ్ఞానముగూడ నున్నదని తెలియఁజేయుటకొరకు ప్రాప్యాయున

జీవితంతువును గల్పనఁ జేసి యామె యా యాదవసింహునిఁ జూచి మోహపారవశ్యమున న మనోభవకేళియందుఁ దనుపుమని కోరగా నాపురుషవరేణ్యుఁ డామె నూరార్చి పాతివ్రత్యఫలము నుపదేశించెనట! ఈకల్పన శ్రీకృష్ణుని సత్ప్రవర్తన కెంత మెఱుఁగు పెట్టినదో నాకుఁ దెలియదుగాని కవియొక్క కల్పనాచాతుర్యమునం దెంత యశ్లీలదోషమున్నదో తేటపడుచున్నది. కావున పాత్రముల గుణాగుణముల విశదీకరించుటకుఁ గల్పించెడి యవస్థలు (Situations.) ఆయాపాత్రముల గౌరవమునకుఁ దగినవిధానముండవలెను. ఊహకుఁ దోచిన వెల్లయు వ్రాయుట సమంజసముగా నేరదు.

2 పురాణసిద్ధములు:-

పౌరాణిక కథలు ప్రాచీనకాలమునుండియు బహుతరచుగ నాటకములరీతిని వ్రాయఁబడుచున్నవి. తొలుదొల్త సంస్కృతభాషను గాళిదాసాది మహాకవులచే నాటకరూపములుగ వ్రాయఁబడిన కథలను మనవారు తెలుఁగునాటకములుగ వ్రాయుచుండుట యెల్లరకును దెలిసినవిషయమే. కాని యొకానొక పౌరాణికపురుషునిఁ గూర్చి పెక్కండ్రు వ్రాసిన గ్రంథములలోఁ బెక్కురీతులఁ గాన్పించుచున్నవి. ఒకేపురుషుఁడు వివిధగ్రంథములలో వివిధరూపములఁ దాల్చుటయద్భుతము అసమంజసముకావున పౌరాణికకథలయందు వచ్చెడు పురుషులయొక్కయు స్త్రీలయొక్కయు పాత్రపోషణ మెట్లుగా నుండవలెనో విచారింతము. ఈవిషయమును చర్చించుటకు

ముందు మన మొక సంగతి వ్యక్తపరుపవలసియుండును. పౌరాణికకథలన నెవ్వి ? ఇతిహాసములును అష్టాదశపురాణములును దేశచరిత్రములును స్థలపురాణములును ప్రాచీనదాసరిపదములును మున్నగు నవన్నియుఁ బురాణకథలనియే వ్యవహరింపవచ్చును. ఈకథలయందలి స్త్రీపురుషుల గుణపోషణము నాటకముల యం దెట్లు నిరూపింపవలయును? ప్రాయశః ఆయాస్త్రీపురుషుల కాయాకథలయం దేయే గుణవర్ణనలు జేయఁబడినవో నాటకములయందును అట్టి గుణవర్ణనలే చేయఁదగినవి. అట్టి గుణవర్ణనము లేని విషయములలోఁ గవీశ్వరుఁడు విశృంఖలుఁడయి యిచ్ఛానువర్తిగా నుండవచ్చును. ఏకపత్నీవ్రతుఁడగు శ్రీరాముఁడు, దక్షిణనాయకుఁడగు శ్రీకృష్ణుఁడు, నిత్యసత్యవ్రతుఁడగు హరిశ్చంద్రుఁడు, సర్వసంగపరిత్యాగియగు బుద్ధుఁడు, ప్రేమసాగరుఁడగు అశోకుఁడు, సుగుణఖనియగుసీత, పతివ్రతయగు సావిత్రి, అద్భుత దేశాభిమానియగు అహల్యాబాయి, అద్వితీయ రాజ్యతంత్ర వేత్తయగు నూర్జహాను, అతిలోకపరాక్రముఁడగు బాలచంద్రుఁడు, పతివ్రతాశిరోమణియగు కామమ్మ, యిట్టివారిగుణగణములు ప్రాచీనగ్రంథములయందు నిర్వచింపఁబడి సిద్ధములై యున్నవి. వానిని మార్చుట కెవ్వరికిని శక్యము గాదు. సీజరు, బ్రూటస్, ఆంథొని, మొదలగు చారిత్రిక పాత్రముల గుణపోషణ ఆ దేశచరిత్రలయందుఁ జేర్కొనఁబడిన రీతిని యున్నట్లే మనపురాణముల యందును, చరిత్రలయందును స్థిరరూపమునయున్న నాయికానాయకుల.

గుణావగుణములు యథాస్థితిగ వర్ణింపఁదగినవిగాని, మార్చు టకు వీలుండదు, మార్చినచోఁ దగిన హేతువులుండవలయును. క్రూరుఁడగు రాజు క్రూరుఁడుగనే వర్ణింపఁదగును. మనము కరుణించి వానిని దయార్ద్రహృదయునిగఁ గనపరచుట సత్య మునకు విరుద్ధము. అట్టిగ్రంథము స్వభావప్రకృతిని విడనాడి నింద్యమగుచున్నది. అయిన నొకానొకపురుషుని గూర్చి వేఱే అభిప్రాయములు చరిత్రలలోఁగాని, యితరప్రాచీనగ్రంథము లలోఁ గాని చెప్పియుండినయెడల మనకిష్టమైనదానినిగ్రహిం చి యాపాత్రను నిరూపింపవచ్చును. అంతకంటె హెచ్చు స్వా తంత్ర్యము గ్రంథకర్తకు లేదు.

3 కల్పితములు.

కల్పితపాత్రములఁగూర్చి కవి "స్వైరవిహారి". తన గ్రంథమందనస్థలనుగాని, పాత్రములఁగాని, గుణములఁగాని, కల్పించుటకుఁ దనయిష్టమువచ్చినట్లు నడపింపవచ్చును. అయి ననేపాత్రను మొదట నొకవిధముగాను ఆగ్రంథమందే తరు వాత వేఱొకవిధముగాను మార్చివేయుట యుక్రమును, అస్వా భావికము. అట్టిమార్పు నిరూపించుటకుఁ బ్రబలకారణములు గ్రంథమందుండవలయును. లేనిచోఁ బాత్రపోషణ క్రమానుగత సమన్వయము (Consistency.) పొందనేరదు. సమన్వయ ములేని పాత్రము స్వభావవిరుద్ధమయి రుచింపనేరదు. కలభా షిణి చంచలహృదయ, ఆమరణాంత మట్లే నిరూపింపఁబడి నది. ఆనాయిక తనసుకృతముల ఫలముగ రెండవజన్మమందుఁ

బతివ్రతగా మారినది. వసంతసేన మొదటినుండియు పతివ్ర తయే. సుప్రసిద్ధకవిపుంగవుండగు షేక్స్పియరు కల్పించిన ఫాల్స్టాఫు (Falstaff.) అనుపాత్రము ఆయనరచించిన రెండుమూడు నాటకములందుఁ గానుపించును. ఎచ్చటనయిన నొకేవిధముగ నింద్రియవ్యాపారలోలుఁడు గాను నిత్యసుఖైక పరాయణుఁడుగాను కనఁబడునుగాని, యొక నాటకమునం దొకరీతిని మరియొకనాటకమునందు మరియొకరీతిని జిత్రింపఁ బడలేదు. ఈవిధమగుసమన్వయము మహాగ్రంథకర్తలందఱు తమకల్పితపాత్రములయందుఁ బాటించియేయున్నారు. ప్రథమమున రాగోద్రేకుఁడుగానున్న మనుజుఁడంతమందువిరాగిగాఁ బరిణమించుట తటస్థించును. ఆమానసికపరిపాకమునుఁ బ్రబల కారణములచే నిర్వహింపనిచోఁ బాత్రపోషణమునందు వెలితి గలుగును. కావున కల్పితపాత్రముల విషయములలో గ్రంథ కర్త తనపాశములచేఁ దానే కట్టఁబడియుండును.

---

# 4 సుఖాంత నాటకములు, దుఃఖాంత నాటకములు.

(Comedies and tragedies)

———— :o: ————

శ్లో॥ఏకోరసః కరుణ ఏవనిమిత్తభేదా
ద్భిన్నః పృథక్పృథగివ శ్రయతే వివర్తాన్।
ఆవర్తబుద్బుదతరంగ మయాన్వికారా
నమ్భోయథాసలిలమేవ హితత్సమస్తమ్॥

(భవభూతి.)

ఆంధ్రనాటకములెప్పుడును సుఖముగా నంతమొంద వలయునుగాని దుఃఖముతో ముగియఁగూడదను కఠిననిర్ణయ మొకటిగలదు.

శ్లో॥పంచసంధి చతుర్వృత్తి చతుష్షష్ట్యఙ్గసంయుతం।
షట్త్రింశల్లక్షణోపేత మలంకారోపశోభితం।
మహారసం మహాభోగ ముదాత్తరచనాన్వితం।
మహాపురుషసత్కారం సాధ్వాచారం జనప్రియం।
సుశ్లిష్టసంధియోగం చ సుప్రయోగం సుఖాశ్రయం
మృదుశబ్దాభిధానం చ కవిః కుర్యాత్తు నాటకం॥

సాహిత్యదర్పణం [6, ప]

కావున నేనాటకముచూచినను నాయికా నాయకులును తక్కిన ముఖ్యపాత్రలును నాటకాంతమున సుఖముగా నానందముతో నివసించుదురు. ఈనిబంధనము ప్రకృ

తికి విరుద్ధమేకాక మానవప్రపంచమునందలి యనుభవచరిత్రలో నొకసగము భాగము మానవనిత్యజీవనమున కుపయోగింపకుండ చేయుటయు గలుగుచున్నది. జాతియందుగాని వ్యక్తియందుగాని కష్టపరంపరలు గలుగుచుండుట సర్వసామాన్యముగదా! ఈకష్టపరంపరలెల్లప్పుడు నెల్లెడలను సుఖాంతముగనుండునా? విపత్తులు కొన్నివిషయములలో విషాదమగు మరణమును గలుగఁజేయుటలేదా? దుష్ప్రవర్తనకు లోనగు మనుజుఁడు పరిణామమున సుఖమునొందుచున్నాఁడా? తన దుర్వ్యసనములచేఁగాని దుష్కర్మలచేఁగాని ప్రాణమునుగోలుపోవుటలేదా? దురహంకారపిశాచముచే నావిష్టుఁడైన రామరాజు రణరంగమునఁ బ్రాణములువిడువలేదా? శాత్రవులదురాశలకు బలియై రంగరాయఁడు వీరస్వర్గముఁ గైకొనలేదా? ఈలాగున నేదేశమందైనను ఏకాలమందైనను గొప్పవారిలోఁగాని కొద్దివారిలోఁగాని దైవికముగనో స్వాభావికముగనో ముప్పువాటిల్లుట యనుభవవేద్యమే. అయితే నాటకము జీవితప్రపంచమునకుఁ బ్రతిబింబమని చెప్పి యెల్లపుడును వ్యక్తిజీవితము సుఖాంతమగునట్లు నిరూపించుట యథార్థమునకువిరుద్ధమగుచున్నదని వేఱజెప్ప వలయునా?

ఈసంగతి యంతయుఁ దెలిసియుండియు మనవారాసన్నమైన మృత్యువు నెదుర్కొనఁజాలక కనికరముఁబూని యేదోవిధముగ మృత్యుదర్శనముఁ దప్పించుకొనఁ బ్రయత్నింతురు. ఆప్రయత్నము లప్పుడప్పుడు చిత్రవిచిత్రగతులొంది

ప్రేక్షకులకద్భుతము గలుగఁజేయుచుండును. గ్రంథకర్త స్వాభావిక పద్ధతుల మరణముదప్పింపలేనియెడల నొకటో రెండో పద్యములు వ్రాసి భగవంతునిఁ దెప్పించును. ఆభగవంతుఁడా పద్యములన్ను వినగానే సందులోనుండియో గొందిలోనుండియో పరుగునవచ్చును. మృతకళేబరము దిగ్గున లేచును. అందఱుచూచి కెవ్వున కేకలువేసి సంతసించెదరు. మృత్యువును దప్పించుటగాని మరణించినవానిఁ బ్రతికించుటగాని యింత సులభసాధ్యమయినచో లోకములోఁ జచ్చినవారే యుండరు. అందరు చిరంజీవులే. కావున ప్రతినాటకము సుఖాంతముగా నుండవలయునను నిర్ణయము కేవల మస్వాభావికము అనుభవ వ్యతిరేకము.

ఆంగ్లేయమహాకవియగు "మిల్టను" ఒకానొకసమయమున దుఃఖాంతమగు నాటకమునుగురించి యిట్లునుడివెను. "Tragedy, as it was anciently composed, hath been ever held the gravest, moralest and most profitable of all other Poems; therefore said by Aristotle to be of power by raising pity and fear or terror to purge the minds of those and such like passions, that is, to temper and reduce them to just measure with a kind of delight stirred up by reading or seeing those passions well imitated." దుఃఖాంతనాటకమునీత్యుద్బోధకమగు గ్రంథసముదాయములలో మిన్నయుకవనసంచయములోనత్యుపయోగకరమైనదియుగావుననే ప్రాచీననియంతయగు అరిస్టాటిలువీ

నినిగురించి చాల నుగ్గడించెను. కరుణభయానక భీభత్సాది రసములు ప్రేక్షకుల యుల్లంబుల నుద్భవించి యట్టి రసోద్రేక పరిచయమువలన వారికి జీవితావస్థలలో నటువంటి యాందో ళన బాధ ముందెన్నడును కలుగకుండఁ జేయఁగలుగునవి యీదుఃఖాంతనాటకములే. మఱియు నుత్కృష్టరసావస్థలు రంగ స్థలమందు నైజప్రకృతి ననుకరింపఁబడగా వారుచూచి యొక విధమయిన సంతోషముతో తమస్వజీవితమునందట్టి యవస్థలు కలిగినప్పుడు ద్వేలమైన రసాతిశయముఁ బొందక సమస్థితిని యుండుటయు తటస్థించును. దుఃఖసాధనములతో జీవితాశయ ములఁ బరిశుభ్రపరచెడు సంవిధానము యితరదేశములకన్న మనదేశమందెక్కువగా వాడుకచేయఁబడుచున్నది. సామా న్యముగ నేకథ జూచినను గష్టపరంపరలే. ఇన్నికష్టములననుభ వించియు తుదకు దైవసహాయముచేత సుఖావాప్తి కలిగినట్లు మనమంతము జేయుదుము. ఇతరదేశములలో గష్ట జీవికి కష్టములే పరిణామముగా నున్నట్లు కనుపరచెదరు. హరి శ్చంద్రుడు ఋతమును లావక యెన్నియో కష్టములనుభవించి తుద కీశ్వరసహాయ్యమున సుఖమునొందెను సావిత్రి శకుంతల కథలు వేరేచెప్పనక్కరలేదు. నలుఁడు ద్యూతకారణము న రాజ్యమును భార్యనుగోలుపోయి దైవబలముచే మగుడిసంపా దింపగలిగెను ఈప్రకార మన్నివిషయములందును దైవబల మును గూడిపెట్టి కష్టములఁ దొలగింపచేయుట మనవారికి వాడుకయినది, గాని యీవాడుక యిటీవలివారి మతమై

యుండవనోపు, ఏలయన భారతవర్షములో ప్రథమకవియయి కవిబ్రహ్మయని పేరొందిన వాల్మీకిమహాకవికి మాత్ర మిట్టి విచిత్రయభిప్రాయముండినట్లు గాన్పింపదు. ఆయన రచించిన రామాయణము నిజముగా దుఃఖాంతమే, సుఖాంతగ్రంథములలో నగ్రస్థానమిన్వదగినది.

లోకారాధనకై సతిమాత్రముగా నశక్యమైనట్టి ఘన శ్రీరామచంద్రుడు పతివ్రతాగ్రగణ్యయైన సీతను గోల్పోయి దుఃఖాంబుధిలో మునింగి పరమాపదించినట్లు నిశ్శంకముగా వెల్లడించెను. దైవమూర్తియగు శ్రీరామచంద్రుడు దైవబలముచేత సీతను దెచ్చికొని సుఖింపలేకపోయెనా? అట్లుచేయక యమ్మహాకవిసార్వభౌముడు కథావసానము దుఃఖనిమగ్నముం జేసివైచెను. ఆకథనే తరువాతికవియగు భవభూతి నాటకనియమములకు సుఖాంతముగం జేయ ప్రయత్నించి యెట్లు తిప్పలు పడెనో చూడుడు.

వాల్మీకిమహాముని సీతాదేవివనవాసకథను నాటకరూపముగా రచించెనట. ఆనాటకము నప్సరసలు ప్రదర్శించిరి. దానిని జూచుటకు మూడులోకములవారు వచ్చిరి. రామలక్ష్మణులు జనకాదిబంధువులు నటం జేరిరి. అట్టి విశాలసభలో నానాటకము ప్రదర్శింపంబడెను. అందు సీతాదేవియొక్క పాతివ్రత్యము నిస్పష్టముగా నిరూపింపబడెనట. దేవతలుహర్షించిరి. మునులానందించిరి. వీరందఱు నిచ్చిన యోగ్యతాపత్రి

కఁ జూచుకొని యనుమానపు భర్తలలో నగ్రగణ్యుఁడగు శ్రీరామచంద్రుఁడు సీతను పునఃపరిగ్రహించెను. ఈద్రావిడ ప్రాణాయామ మంత్రమును జూడుఁడు. సుఖాంతముగాఁ గ నుపరచుటకుఁ గవి పడిన పాట్లు జూడుఁడు. ఇంతటి యవస్థఁ బొందనేల? అసలుకథ నున్నదియున్నట్టుల వ్రాసిన నేమి విపత్తు కలుగును?

బహుకష్టజీవియై భర్తయొక్క పరీక్షలతో విసివివేసారిన పుణ్యసాధ్వీలలామ యగు సీతాదేవి తనకడపటి పరీక్షకాలమునఁ బల్లియగు భూదేవినుద్దేశించి పలికిన దీనాలాపములను వినుఁడు.

శ్లో॥ “సర్వాన్ సమాగతాన్ దృష్ట్వా సీతాకాషాయవాసినీ
అబ్రవీత్ ప్రాంజలిర్వాక్య మధోదృష్టి రవాఙ్ముఖీ।
యథాహం రాఘవాదన్యం మనసాపినచింతయే
తథామే మాధవీదేవీ వివరం దాతుమర్హతి।
మనసా కర్మణావాచాయథారామం సమర్చయే
తథామే మాధవీదేవీవివరం దాతుమర్హతి।
యథైతత్ సత్యముక్తంమే వేద్మిరామాత్పరంనచ
తథామే మాధవీదేవీవివరం దాతుమర్హతి॥”

ఈమర్మభరశోకగర్భితములగు శాంతవచనములు మానవహృదయములను పరీక్షించునవి యీలోక భవభూతి వ్రాసిన సీతావనవాసనాటకమా? చదువవలెనని నిర్ణయించుకొనుఁడు గాక!

నాటకము కేవలము దుఃఖాంతముగఁజేసి ప్రేక్షకుల యుల్లంబుల విషాదముమాత్రము నెలకొల్పి వారిని గృహములకంపుట యేటిపురుషార్థమని కొందరు శంకింపవచ్చును. తెరువులేని శోకసముద్రమున ముంచి నిస్సహాయముగా నుంచుటకంటె దుఃఖాంబుధికంతకు నౌకయనందగు కరుణామయుండగు భగవంతుని నిరంతరసాన్నిధ్యమును నిర్నిమిత్తసాహాయ్యమును ప్రదర్శించుటయే యోగ్యతమముగాఁబాయని యాక్షేపింపవచ్చును. విపదవస్థలలోనున్న మానవుని రక్షించుటయే పరమావధియనియు నట్టి రక్షణ భగవంతుఁడు తప్ప వేరొకరు సంపూర్ణముగాఁ జేయలేరనియుఁ దెలుపవలసినదో నాసంవిధాన మితరగ్రంథము లన్నింటికిని యేల వర్తింపఁగూడదు? ఒక్క నాటకములకే మనవారు నిర్ణయింపవలసినదేల ? అనేకమైన పాటలు, పదములు కథలు వ్రాయఁబడినను అందీ నియమము పాటింపకయే వ్రాసియుండిరే. అట్టి భేదము నాటకములమాత్ర మేలకలుగవలెను? కావున వాఙ్మయము ప్రకృతికి విరుద్ధముగానుండక జీవితాదర్శములతో సమన్వితమై యుండవలయునుగాన చరిత్రలలోఁగాని, నాటకములలోఁగాని, నవలలలోఁగాని కథలు పాటలు పదములుమున్నగు వానియందుఁగాని దుఃఖపరిణామముగా నున్న జీవితమట్లే నిరూపింపవలయును. సుఖాంతము జేయుటకై భగవంతుని ప్రత్యేకముఁ దెచ్చిపెట్టి రక్షణయొనర్చుట స్వభావవిరుద్ధమని నాయాశయము.

ఆధునికనాటకకవులలోఁ బ్రథమశ్రేణియందుండఁదగిన కోలాచలం శ్రీనివాసరావుగారు వ్రాసిన "రామరాజు" లేక "విజయనగర సామ్రాజ్యాంత" మనెడి నాటకము నిక్కముగ విషాదనాటకమే. కవీశ్వరుఁడు సంస్కృతనాటక నియమముల నుల్లంఘింపలేక సుఖాంతముఁ జేసినటులెవ్వనికైనను దోఁపక మానదు. దుఃఖాంతముఁ జేయుట చరిత్రయందలి యథార్థమునకు సరిపోవును. ఏలయన యుద్ధరంగంబున రామరాజు మరణముతో విజయనగరసామ్రాజ్యము గూడ మరణించినదను విషయము చరిత్రకారులు స్థిరముగఁ జెప్పినదే. రామరాజు తరువాత నతని సింహాసనము నధిష్ఠించినవారు లేరు. సామ్రాజ్యమును వెనుకటియుచ్చదశకుఁ దెచ్చినవారును లేరు. కాఁబట్టి రామరాజునుగుణములచేఁ జేరొందిన రాజ్యమతని యవగుణములచే శిథిలమొందెనుగావున దుఃఖాంతనాటకము లకిదియొక గొప్పనిదర్శనమగును. ఆప్రకారము కవి తనగ్రంథమును ముగించినయెడలఁ బ్రపంచమందలి గొప్పదుఃఖాంతనాటకములకిది యీడుదీయకపోవును. "జూలియసుసీజరు" "కేటో" "గట్సువాన్ బెర్లిషింజను" మున్నగు మహావీరుల గురించి వ్రాయఁబడిన దుఃఖాంతనాటకములతోఁ దుల్యమై విరాజిల్లుచుండవలసినదే. అట్లుచేయక నూతననాటక మార్గదర్శియయ్యును సుఖాంతనియమమును దాటలేక యీగొప్పనాటకమునకుఁ దీరని కొఱంతఁ గలుగఁజేసెను. ఆలోచనుదనసామాజికులు దీర్చినను కవీశ్వరుని ప్రతిభయందలి కళంకమట్లే

యున్నది. కొలఁబోయుండెనను బటాణుఁడు పితృమరణముగా వించి బ్రతుకవలసినవాఁడా? తనయందు సంపూర్ణ విశ్వాసముగల తండ్రిని మతద్వేషముచేఁ గపటోపాయమునఁ జంపిన శూరుఁడు బ్రతికినయెడల నాయకుఁడగుట కెంతమాత్రమును దగఁడు. కావునఁ దండ్రినిజంపిన కరవాలముచేఁ ద్రాఁజచ్చుటయే ధర్మము. అతఁడు జచ్చినయెడల నాతనికంటె నెక్కుడభిమాన సాహసములుగల ఆషాబీ నిశ్చయముగ వీరస్వర్గము నొందును. ఆలాగున మార్చిచూపించిన గ్రంథమే యుద్గ్రంథమై యాంధ్రవాఙ్మయము మునుపటి ప్రకాశముతో నెగడొందుచుండును.

ఇట్లు చెప్పుటచే విషాదకథలన్నియు విషాదాంతములుగనే కనుబరుపవలయునని నాయభిప్రాయముగాదు. ఏకథనయినను దుఃఖాంతముగ రచింపవలయునా లేక సుఖాంతముగ రచింపవలయునాయను విషయమును నిర్ణయించుటకా కథ దేశచరిత్రయందుఁగాని పౌరాణికగాథలయందుఁగాని యేరూపమును దాల్చియున్నదో ముందు దెలిసికొనవలసియున్నది. మోదాంతమగు నైతిహ్యముగాఁ గథాసాంప్రదాయములోఁ జేరియున్నయెడల దానిని విషాదాంతముగఁ జేయవలను పడదు. హరిశ్చంద్రుని గాథ విషాదాంతముజేయుటెట్లు? పరమేశ్వరునిచే లోహితాస్యుఁడు బ్రతికింపఁ బడెననియు, చంద్రమతియందు ఖడ్గనిహతి పుష్పమాలాకృతి నొందెననియుఁ బురాణము ఉద్ఘోషించుచుండఁగా మన మెట్లుమార్పఁ లగము? అట్లు మార్చుట యనుచితము నధర్మమునుగాదా?

శ్రీనివాసరావుగారికి సమకాలికుఁడై, సహవాసియై, సహోద్యోగియై యాయనవలె ననేకాంధ్రనాటకముల రచించి పెక్కండ్రచే నాంధ్రనాటక పితామహుఁడని యెన్నికనొందిన ధర్మవరము కృష్ణమాచార్యులువారు 'విషాదసారంగధర' మను పేరను సారంగధరనాటకమును దుఃఖాంతముగ వ్రాసినారు. సారంగధరునికథ మనము వెనుకటి గ్రంథములలో దేనియందుఁ జదివినను సుఖాంతముగనుండెనుగాని దుఃఖాంతమును బొందియుండ లేదు. పదునాలవశతాబ్దమునఁ బ్రబంధరూపమునఁ జేమకూర వేంకటకవి వ్రాసిన సారంగధరచరిత్ర సుఖాంతముగనేయున్నది. పదునెనిమిదవశతాబ్దములోఁ గూచిమంచి తిమ్మకవి వ్రాసిన సారంగధరచరిత్రమనెడి ద్విపదకావ్యములోఁ గూడ నట్లేయున్నది. మఱియు యక్షగానములలో సైతము మోదాంతమే. కర్ణాకర్ణికగా వచ్చుచుండు నైతిహ్యమందును సారంగధరుఁడొకానొక సిద్ధుని చికిత్సాక్రియలచే నంగవైకల్యము తగ్గి పునర్జీవితుఁడయ్యెనని తెలియుచున్నది. ఇట్లుండఁ గృష్ణమాచార్యులుగారు సారంగధరుఁడు మరణించినట్లు వ్రాయుట కేవలము చరిత్రకు విరుద్ధమైనది. చరిత్రకు విరుద్ధమగుటచే యథార్థమునకు దూరమగును. యథార్థమును దప్పించుట కల్పనకొక గొప్పకళంకము. కావునఁ గృష్ణమాచార్యులువారు శ్రమఁజెంది నూతనమార్గమున వారొనర్చిన కార్యము సమంజసముగాదనియు సంస్తవనీయముగాదనియు నేఁజెప్ప సాహసించుచున్నాను. సారంగధరనాటకమును

దుఃఖాంతముగఁ జేసినచో వీరబొబ్బిలినాటకమునుగూడ దుః ఖాంతముగఁ జేయఁగూడదా? అట్లు జేయుటయు దేశచరిత్రకు వ్యతిరేకమే. ఏలయన బొబ్బిలివీరుల రుధిరధారలచేఁ దడిసిన సంగరాంగణము తడియాఱకుండగనే బాలుని వేంకటరాయుని పితృపైతామహసింహాసనమున బూసీదొర యాసీనునిగఁ జేసె నని బొబ్బిలికథయందుఁ జరిత్రకారులు జెప్పియున్నారు. ఆహేతువుచే వీరబొబ్బిలికథ రంగారాయనురణముచే దుఃఖ సమాప్తమైనను వెనువెంట నేకలిగిన రాజకీయపరివర్తనముచేసు ఖాంతమయ్యెనని చెప్పవలసివచ్చినది. కావున నేకథనైనను నిర్హేతుకముగ నిరాధారముగ ఖేదాంతము జేయుటకుఁ గవి కధికారములేదు.

అనేకశతాబ్దములనుండి జాతిమతసంరక్షణకొఱకేమి, దేశసంరక్షణకొఱకేమి రక్తధారలలో మునిఁగి యసువులఁ గోల్పోయిన మహావీరులగు స్త్రీపురుషుల చరిత్రలతోఁ బరి పూర్తమైన పుణ్యభూమియగు నీభారతవర్షంబున నిజమగు విషాద చరిత్రలకేమికొదవు? మలిక్కాఫరుతోఁ బోరాడి రణ రంగంబునఁ బ్రాణముల నీసిన దేవగిరిప్రభువగు రామదేవుని చరిత్రకులేదా? పరదేశీయులగు శకశత్రుదళములతోఁ బోరాడి రణరంగంబున వీరస్వర్గమును జూఱగొనిన భోజ మహారాజు చరిత్రకులేదా? అక్బరువాదుషాసేనల యుద్ధతి కోహటించని నమ్ముగట్టి పురుషవేషముదాల్చి కత్తిచేఁ బూని మొగలాయిసేనలతోఁ బోరి ప్రాణములవీడిన యహా

త్కృష్టాదర్శములను వెదజల్లుటయు, నాంధ్రనాటక తేజస్సును ప్రపంచనాటక ప్రభాపుంజములోఁ ప్రసరింపఁజేయుటయు నొనరింతురుగాక !!!



# 5 నాటక ప్రదర్శనము.

శ్లో॥ఆపరితోషాద్విదుషాం
న సాధుమన్యే ప్రయోగవిజ్ఞానం।
బలవదపిశిక్షితానా
మాత్మన్యప్రత్యయం చేతః॥

[కాళిదాసు]

ఆంధ్రనాటకప్రదర్శనము మన తెలుఁగుదేశములో ననేక ప్రాంతములయందు ననేకరీతులుగా నున్నది. ఒక దిక్కునందున్న పక్కి మఱియొకదిక్కున లేదు విశాఖపట్టణమునైపు నొకమాదిరియు, గోదావరి, కృష్ణా, గుంటూరు ప్రాంతముల మఱియొకతీరను నెల్లూరుమండలమున నింకొక

పద్ధతిని, బళ్ళారిలో మఱియొకవిధమును ఇట్లు తెలుఁగుదేశములో నానాదిక్కుల నానావిధముల నాటకప్రదర్శనములు జరుగుచున్నవి ఈభేదములు సామాన్యముగ నాల్కైదు తెర గతులక్రింద విభాగింపవచ్చును, అవేవన:—

(1) Scenery (తెరలు).

(2) వస్త్రధారణము.

(3) సంగీతము.

(4) అభినయము.

వీనియందలిభేదములు సామాన్యముగ నాయాస్థలములయందున్న భాషాభేదములు, ఆచారవ్యవహారభేదములం బట్టి కలుగుచున్నట్టుల సూక్ష్మదృష్టికి గోచరమగును. ఈభేదముల సూక్ష్మవివరణ మిచ్చుట యనావశ్యకము. స్థాలీపులాకముగాఁ గొన్నిఁటి మాత్రము క్రిందవివరించి, తద్విషయములలో నాయభిప్రాయమునుగూడఁ జెప్పెద.

పురాతనకాలమునుండి వీధినాటకములు, భాగవతులు మనదేశములో నాడఁబడుచుండుట వాడుక. ఇప్పటి కాలమందాంగ్లేయ సంసర్గముచే నాటకములయందు నూతన పద్ధతులు వృద్ధినొందుచున్నవి. మొట్టమొదట నాటకప్రదర్శనము పార్శీ మరాటీ నాటకప్రదర్శనముల మాదిరిగఁ బ్రారంభింపఁబడిన విషయమెల్లఱకుఁ దెలిసినదే. దీనికిఁగాను శాశ్వతమైన నిదర్శనములు కృష్ణమాచార్యులుగారును, శ్రీనివాసరావుగారు ప్రభృతులువ్రాసిన పాటలే. అవి పార్శీమట్లమీఁదను.

వ్రాయఁబడుటయు, పార్శ్వస్వరములతోఁ బాడబడుటయు నిప్ప టికినిజరుగుచున్నది. ఈపాటలును,ఈమట్లునుమన నాటక చరిత్ర మునెల్లకాలము వేనోళ్ళఁజాటుచునే యుండును. బాపటు కంపెనీయును, బలవంతరావుకంపెనీయును, మన దేశములోఁ జాలకాలమువఱకు సంచారములుచేసి నాటకప్రదర్శనమందు మనవారికిఁ గొంతయభిరుచిఁ గుదిర్చినవి. అంతకంతకుఁ గ్రమ ముగా మనప్రదర్శకశిఖామణులు జాతీయబంధనముల విడ నాఁడి యాంధ్రనాటకమున కాంధ్రత్వమును దెచ్చుచున్నారు ఇప్పుడు దేశమందన్నిచోట్లాంధ్రత్వనిరూపణమందు హెచ్చు తక్కువలు కాన్పించుచున్నవి; గానివిజాతీయవిదేశీయాను కరణోత్సాహములయందు వైముఖ్యమేయున్నది. ఇది కడు సంస్తవనీయమైన విషయముగాదా!

## 1 దృశ్యజాలము (Scenery)

మన నాటకశాలలయందు నవనికాదిదృశ్యజాలము మనదేశమందలి చిత్రలేఖనముతోఁబాటు విదేశీయవస్త్వను కరణముగానుండెడిది. క్రమక్రమముగా దేశీయప్రకృతి మన వృత్తులయందుఁ బెరిఁగినకొలఁది విదేశీయాభిమానము తగ్గుచు వచ్చెను. ఇప్పటికిని నెల్లూరుపురమందిరమున నున్న నాటక రంగస్థలమున ముందు వ్రేలాఁడుచున్నతెర విదేశీయ చిత్ర పటమే. అది యీజిప్టుదేశాధిరాజ్ఞియగు క్లియోపాత్రా తన స్త్రీగో చెలికత్తెలతో వినోదించుచున్న తీరుగఁ గాన్పించు చున్నది. మనచిత్రలేఖకు లిప్పటికి దేశీయవిషయములను

సభక్తికముగ గమనించి దేశీయచిత్రలేఖనమును వృద్ధినొందించుచున్నారు. రవివర్మ తన పటములయందు మన పురాణ కథలను జిత్రించియుండుటచే దేశీయులెల్లరకు మార్గదర్శకుండయ్యెను. అవిద్యయైనను విదేశీయ సంసర్గము కేవలము విడువలేదనియే కొందఱి మతము. వగదేశమునందు వంగీయచిత్రలేఖన ముద్ధరింపఁబడినటుల మన యాంధ్రదేశమందు మన దేశప్రకృతికి సరిపోవునొక నూతనకళపొడ సూపుచున్నది. అయ్యది ముఖ్యముగా బందరు, రాజమహేంద్రవరపట్టణములలోఁ బ్రారంభింపఁబడినది. బందరులోనున్న యాంధ్రజాతీయకళాశాలయందును రాజమహేంద్రవరములో కీర్తిశేషులయిన దామెర్ల రామారావు ప్రభృతులచేతను నాంధ్ర దేశీయ జిత్రలేఖనాకళ వెల్లడిఁజెందినది. అదియింకను బ్రత్యేకాంధ్రవ్యక్తిని బ్రత్యక్షముగా సగౌరవముగాఁ జూపుటలేదు. కాని యట్టి భావిపరిణామమునకు మార్గదర్శినిగానున్నది. మన నాటకశాలాధికారులీ నూతన కళాద్యోతకులగు చిత్రలేఖకుల సహాయముఁ జేకూర్చుకొని, తమరంగస్థలముల దేశీయచిత్రపటములతో నలంకరింపవలసి యున్నది. దేశీయప్రకృతి వర్ధిల్లినకొలఁది దేశవ్యక్తి విస్తరిల్లునుగదా!

## [2] వస్త్రాద్యలంకారములు.

వస్త్రాద్యలంకారములయందు మననాటకుల కౌచిత్యము కంటెఁ జాపల్యము హెచ్చు. మణిస్థగితభూషణములును,

అమూల్యవసనములును, సామాన్యముగ ధరించెదరు. మన స్త్రీ పురుషులు నాటకరంగస్థలమునఁ గూడనట్టి విలువగల వస్తువు లుధరించుట సహజమే. అంతియగాక సామాన్యముగ మననా టకములోని నాయికానాయకులు రాజవంశములకుఁ గాని, దేవగణములకుఁగాని చెందినవారగుటచే నవనిధులు వారి యరచేతులలోనే యుండును. అట్టివా రెంతవిలువయిన వేషము వేసికొనినను సమంజసముగానుండును. కాని నిరాడంబరము, నిర్ధనమే ముఖ్యజీవికగా నుండఁదగిన లోకోత్తరులగు ముని పుంగవులు కూడ ముకముల్పట్టుకోఁకను, ముచ్చిబంగారము కోఁకను బోల్లాడుట హాస్యాస్పదము. ఒకానొక పల్లెటూరి నాటకసమాజములో నారదపాత్రమునుధరించిన యువకుఁడు పట్టుపరాయియును, సరిగకుట్టులకోటును నిచ్చినఁగాని రంగ స్థలమునకు వెళ్ళననిపట్టుబట్టెను. పీఁచుగెడ్డము, నెఱ్ఱని జడలనం టించుకొని కోటుపరాయులఁదొడిగికొనిన నావేషమెంతరమ ణీయముగ నుండునో ప్రేక్షకులే గ్రహింతురుగాక! నారదుడు కాకపోయినను నబీసాహేబువలె నుండును. ఇట్టి పిచ్చిపోకుల కంటె నుచితజ్ఞతయుండిన నెంతమనోజ్ఞముగానుండును? ఏకా లపుపాత్రమునకాకాలపు వేషమును, యేదేశపుపాత్రమున కాదేశపువేషమును ధరించుట స్వతస్సిద్ధము, నిరాక్షేపణీ యము, మనోహరము. మన యాంధ్రదేశమున నుచితమైన వస్త్రధారణము మన గ్రంథములయందచ్చటచ్చటఁ గాన్పిం చుచున్నయది. మనుచరిత్రయందలి మాయాప్రవరునివేష

మును వర్ణింపుచు పెద్దన యాంధ్రబ్రాహ్మణనతంసునివేష మును వర్ణించెను.

సీ. అర్ధచంద్రుని తేట నవఘళించు లలాట
పట్టిఁదీర్చిన గంగమట్టితోడ
జెక్కుటద్దములందు జిగివెల్లువలుచిందు
రమణీయ మణికుండలములతోడ
బసిఁడివ్రాత చెఱంగు మిసిమిదోపఁజెలంగు
నరుణాంశుకోత్తరీయంబుతోడ
సరిలేనిరాకట్టు జాళువా మొలకట్టు
బెడగారు నీర్కావిపింజెతోడ
గీ. ధవళధవళములగు జన్నిదములతోడఁ
గాశికాముద్రయిడిన యుంగరముతోడ
శాంతరసమొల్కు బ్రహ్మతేజంబుతోడ
బ్రవరుఁడయ్యె వియచ్చరప్రవరుఁడపుడు.

[మనుచరిత్రము.]

రాజవేషమునుగురించి యిట్లుజెప్పబడినది:

శ్రీకృష్ణుని వర్ణించుచు ముక్కుతిమ్మన్న యిట్లుఁ జెప్పెను.

"వెన్నెలనిగ్గులు వెదచల్లెడుమడుంగు
లందిచ్చెనొక్క ఫుల్లాబ్జనయన"

[పారిజాతాపహరణము.]

ఆ॥2.

శ్రీరాముని గురించి:

"హారకేయూరవలయు శిరోభూషణములొప్పార
రఘురాముఁడు సర్వనైభవాలఘుజనమనోభిరాముఁడయ్యె"

[అధ్యాత్మరామాయణము]

"క్షోముల చారు దుకూలంబు వెడలించి
కచ్ఛశవల్కాంశుకములు గట్టి.

[భాస్కరరామాయణము.]

రాజవేషమునందు మువ్వలు పలుకట్టి యంగీలఁ దొడిగినటులేయున్నది కాని షరాయులు ధరించినటు లెక్కడను కానరాదు. తిరుపతి దేవాలయములో శ్రీకృష్ణదేవరాయలయొక్కయు, వేంకటపతిరాయలయొక్కయు, నిత్తడివిగ్రహములలో బంచకట్టు కాన్పించు నేకాని షరాయితొడిగినట్లులేదు. కనుక షరాయిఁదొడుగుట మన దేశాచారము కాదనియు ప్రాయశః ప్రాచీనాచారము కాదనియు నాయభిప్రాయము. తజ్ఞులు సహేతుకముగా దీనిని ఖండించినచో నాతప్పు సవరించికొనియెదను. కావున నిట్టివేషములు మనకు నైసర్గికములై యుండ మహారాష్ట్రకుళ్లాయులు, బంగాళీటోపీలును, తురకషరాయిలును, మన వారంచు ముకొంటుసు వేసికొనుట పామరజనాకర్షణహేతువు గానున్నను సవిత జ్ఞులకు హాస్యజనకముగానే యుండును. ఔచిత్యమును మించిన వేషము దోషమే.

## 3 సంగీతము.

నాటకములలో నటీనటులు పద్యములఁజదువుటలో సంగీత మెంతవఱకు వాడవలెనో యను నంశమునుగురించి యనేకవిమర్శకులు భిన్నాభిప్రాయములనిచ్చియున్నారు. ఈ విషయమును నేను ప్రథమముననే చర్చించితిని. రసోద్రేకము గలిగించి, తన్మూలముగాఁ బ్రజలకు నీత్యుద్బోధనముఁగావించుటయే నాటకముయొక్క ముఖ్యోద్దేశము గాన నట్టి రసోద్రేకముఁ గావించెడి సుసాధనము లన్నియు నాటకముల యందు వాడఁదగినవే. అట్టి సాధనములయందు సంగీతాభినయచిత్రలేఖనములు ముఖ్యములైనవి. కావున వీనినన్నిఁటిని నాటకరంగములయందుచితరీతిని బ్రయోగింపఁదగును.

నాటకరంగము సంగీతసభ కాదని యెఱుంగనగును. సంగీతసభయందు కేవలము సంగీతవైభవమే వినియానందింతుము. నాటకరంగమందు నాటకప్రకృతియొక్క భావోన్మీలనముఁ జూచియానందింతుము. అట్టిభావోన్మీలనమునకు సంగీతమొక్క యుపసాధనము; గాననంతకంటెదానికెక్కువ ప్రాముఖ్యతనీయఁగూడదు. భావప్రకటనకు సంగీత మెంతవఱకుఁగావలెనో యంతయే జూపఁదగినది. అంతకంటెనెక్కువగా సంగీతమాలాపనఁజేసి పద్యములయొక్క యర్థమును, భావమును సంగీతచాతుర్యమునందు మఱుఁగువెట్టినయెడల నట్టి పాత్రము సంగీతవిద్వాంసుఁడనిపించుకొనును కాని మహానటుఁ డనిపించుకొనఁజాలఁడు.

పాటలుపాడుటయందే కాక పద్యములుజదువుటయందుఁ గూడఁ సంగీతముపయోగింపవలసిన కారణము వేఱొండుకలదు. తెనుఁగుభాషయొక్క ప్రకృతియే స్వరమాధుర్యము. అందుచేతనే సంగీతశాస్త్రముయొక్కయభివృద్ధికిదియెంతయో యుపకరించుచున్నది. అట్టిభాష మనకు మాతృభాషయయ్యె భాషయందలి పద్యములను స్వరనియమములేకుండఁ జప్పగాఁజదివినయెడల భాషాప్రకృతిని చంపినవారమగుదుము. ఈ రెండుకారణములచేతను తెనుఁగుపద్యములుచితమగు రాగధోరణిలోనే చదువవలెను. కాని యారాగముమాత్రము పద్యమునంతా నావరించి ముంచివేయఁగూడదు.

సంగీతసభానాటకములందు నీ నెలఁగినంతవఱకుఁ జాల కాలమునుండి నిక్కారిసాహెబులగు ప్రథానమునుంచియున్నారు. వారు పైఁజెప్పిన నియమములఁ బాటించుచు నాటకప్రదర్శనమును గడు రమణీయముగఁ జేయుచుండిరి. సంగీతమునందు విద్వాంసులున్నను వారు తమ ప్రాగల్భ్యమును గొంతవఱకు సంతరించికొని పద్యములందలి భావప్రకటనము స్పష్టముగాను బహుమనోహరముగాను చేయుచువచ్చిరి. కాని కృష్ణాగోదావరీలయందును, బళ్ళారి ప్రాంతములయందును, మొన్నమొన్నటివఱకు సంగీతముయొక్క యార్భాటమే నాటకములయొక్క ప్రాశస్త్యపు బిరుదుగా యోజింపఁబడినట్లు గాన్పించుచుండెను. ఒక్కొక్క పద్యముతో మొదలుపెట్టిన రాగముద్దానితో ముగియవలసినదే. పద్యముపూర్తియగువఱకు సుమారు

రగంట పట్టును. సగముకాలము పద్యము తక్కినసగముకాల ము రాగముయొక్క యాలాపనము. ఒకానొకసమయమున చప్పట్లు కొట్టువఱకు ఆలాపనముజరుగవలసినదే. ఈపద్ధతి యిప్పుడుమన్నదైనను గొంత తగ్గినది గాని బళ్ళారి ప్రాంతముల యందుఁ దగ్గినటులఁ గాన్పింపదు. నాటకవిధానములో సగ్రస్థానముఁగన్న బళ్ళారియందీ లోపము తగ్గకపోవుటజాలవిచార కరము.

4. అభినయము.

సంగీతము వలెనే యభినయమును గూడ నౌచిత్యనియమపు కట్టుదిట్టములలో నుంచవలెను. మననాటకులు భరతశాస్త్రమునంతయుఁ జదువనక్కఱలేదు. అది సర్వకళలలాములపని; గాని వేశ్యావనితలవలెనే కొంతమంది నటులు ప్రతిశబ్దమునకు నభినయముఁ గన్పఱచనిచోడల లోపమని తలఁచుచుందురు. ప్రతిమాటను చ్చరింపుచుఁ జేతినో కాలినో కంటినో త్రిప్పుచుందురు. ఆనృత్యము భాగము మేళమువలె నుండును,గాని నాటకమువలెఁగాన్పింపదు. బళ్ళారి టి. రాఘవాచార్యులుగారు, నెల్లూరు నాగరాజారావుగారు, రాజమహేంద్రవరము జగ్గరాజు గారు మున్నగు మహానటుల యభినయముఁ జూచినఁగాన్నేతులకంటె ముఖదృష్టియందే యెక్కుఁ వభినయముండఁ దగినదనియు, స్వరభేదముచే భావవికారములు ముఖ్యముగానిరూపింపఁబడఁ దగినవనియుఁ దెలియవచ్చును. రంగస్థలమంతయును డుసుఁద్రొక్కునటులఁద్రొక్కుట యిప్పుడంతగాఁ

బట్టణములయందుఁగాన్పింపదు. కాని శృంగారరసము వెలువఱచుటలోమాత్రముపిచ్చిపిచ్చిహాస్యవిన్యాసములేగాక పిఁఱిడివలె గంతులు వైచుటగూడఁ దఱచు గాన్పించుచుండును. అనాటకులే ప్రేక్షకులలోఁ జేరి యిట్టికృత్యములను జూచిన మోడలఁ జాలసిగ్గందుదురనినానమ్మకము. ఈవిషయములో షేక్స్పియరు మహాకవి చెప్పినదానికన్న నెక్కువ చెప్పుటకవకాశములేదు.

"Do not saw the air too much with your hand, thus, but use all gently; for in the very torrent, tempest and, as I may say, the whirlwind of passion, you must acquire and beget a temperance that may give it smoothness."

"గాలిని అంపముతోఁత కోయుచున్నట్లుగా చేతులను నిరంతరముఁ ద్రిప్పక, నెమ్మదిగాను, శాంతముగాను అభినయింపుము. ఏలయన, రౌద్రభయానకరసము లుద్వేలములయి, ప్రళయాభీలకల్లోలమువలెను, ప్రచండ మారుతమువలెను, కోలాహలము బొందుచున్నను నీవు చిత్తవిభ్రమణము బొందక, ఔచిత్యమును, పరిమితిని బాటించి, మృదులమగు రీతిని నిరూపింపుము''

ప్రతిదేశములోను ముఖ్యముగా మనహిందూదేశములో స్త్రీలెక్కువశాంతచిత్తులుగను అడఁకువ, నమ్రతఁగలిగినవారుగనునుందురని యందఱొప్పుకొనినవిషయమే. అందులోఁ బ్రాయశఃగొప్పకులమునందుఁ బుట్టినస్త్రీలుమఱింతయెక్కువవినయముగానుందురు. అట్టివిషయములో నున్నతకులజులగు

స్త్రీలననుకరించెడి స్త్రీపాత్రములు రంగస్థలమునందుఁ జేతు లందిప్పికొనుచు గంతులువైచుచుఁ బురుషులతో సరససల్లాపములాడుటఁ జూచిన నా స్త్రీలు కులీనులా కులటలాయను సందేహము ప్రతివానిమనమునందుఁ బుట్టించుచుండును. ఇట్టి శృంగారరసప్రదర్శనము దాసరులాడెడి తోలుబొమ్మలాటవలెఁ గాన్పించునుగాని సరసమగు నాటకప్రదర్శనముగనుండదు.

పామర జనాకర్షణమునకో లేక జీవితచరిత్రముల యొక్క ప్రతిబింబిత సాధనము నకోయన నిప్పుడిప్పుడు మరణము హత్యమొదలగు ఘోరప్రదర్శనములను రంగస్థలములఁ గనుపఱచుట జరుగుచున్నది. ఇట్టి భయావహములగువిషయములను జూపఁగూడదని ప్రాచీననాటకనిర్ణేతలుఖండనముగాఁ జెప్పియుండుటయు, మహానాటకకర్తలా నిబంధనముల నతిక్రమింపకపోవుటయు బహుళగ్రంథవేత్తలెఱింగిన విషయమే. ఈ కాలమునందుఁ బ్రాచీనాచారములను, ప్రాచీన నియమములను బూర్వపక్షముజేయుటయు, సంస్కరణయోగ్యమగు వానిని సంస్కరించుటయో, లేక నతిక్రమించుటయో విధాయకముగ నున్నను గొన్నివిషయములుమాత్రము మానసజీవిత పారిశుద్ధ్యముకొఱకు సర్వదాయనతిక్రమణీయములు. అట్టివిషయములలో నిదియొకటి. ఘోరప్రదర్శనములు కేవలము భయావహములయి జుగుప్సాకరములయి నాటకదర్శనాకౌతూహలమును జాలవఱకుఁ దగ్గించును. మానవహృదయములయందు సహజకారుణ్యభావముల శుష్కింపఁజేసి కాఠి

న్యముఁగలుగఁజేయును. నాటకములయొక్క ముఖ్యోద్దేశమట్టి పరిణామము కలుగకుండుటయే. ఇట్లుండఁ బరిపక్వాంతఃకరణ ప్రదాయకములగు నాటకములును నాటకరంగస్థలములును ఘోరకార్యకరణ ప్రచురణములుగఁ జేయుట నాటకవిపర్యయముగాని వృద్ధిసాఫల్యముగాదు—

కావున నో మహనీయులగు నాటకప్రదర్శకులారా? నటీనటవతంసములారా? మానవజాతియొక్క నీత్యుద్బోధనమున కుత్పత్తిసాధనములయిన నాటకములను కేవలము ద్రవ్యాకర్షణముకొఱకు, నీచక్రీడాసంతుష్టికొఱకు నింద్యమార్గముల నడిపింపక పరమపావనపథములఁబట్టి ప్రదర్శింపుచు మీరు జన్మసాఫల్యము నొంది దేశమునందుఁ జిరకీర్తనీయులగుదురుగాక !



# ఉపసంహారము.

నాటకములయుత్పత్తియు, వాని నిర్మాణము, కథారచన, పాత్రపోషణము, ఇత్యాదివిషయములగురించి నాకుఁ దోచినరీతిని బ్రసంగించితిని. ప్రస్తుతము జర్చింపఁబడుచున్న విషయములఁగూర్చికూడ వాదప్రతివాదములఁజూపి నాయభిప్రాయములను సహేతుకముగఁ గనపరచితిని. ఈవిషయములఁ

గూర్చి యింతపరిశ్రమ జేయుటకుఁగారణ మేమన—ప్రజాబోధ నమునకు నాటకములొక ముఖ్యసాధనమని నాకుఁగలిగిన దృఢమైననమ్మకము.

ప్రజలయందలి నీత్యవినీతుల నిర్ణయించుట కాదేశ మందలి నాటకములే సాక్ష్యములని మహావిమర్శకులు జెప్పు చున్నారు. ప్రాచీనగ్రీకులయొక్కయు, రోమనులయొక్కయు సమగ్రమైన నాగరికతను ద్యోతకపఱచెడి యాధారములా దేశములందలి ప్రాచీననాటకరాజములని చరిత్రకారులు చెప్పినయథార్థము. ప్రజలయొక్క గుణగ్రహణపారీణతఁబట్టి యాదేశమందలి నాటకముల యుత్కృష్టతనిర్ణయింపఁబడును. కావున నాటకములను శ్రేయోమార్గముల రచించినయెడలఁ బ్రజలనుగూడ నట్టిమార్గముల నడపించుటయేయని నిశ్చయిం పవచ్చును.

పూర్వకాలమున, నేదేశమందైనను నాటకములఁ జూచి సంతోషించినను, నాటకులమాత్రము ప్రజలునిరసిం చుట యాచారమయియుండెను. ప్రజాసంఘమందు వారికి గౌరవమైనపదవిలేదు. మొన్నమొన్నటివఱకు మన దేశమందు నిదేస్థితి. నాటకులకు జాయాజీవులని యొకపేరు. అనఁగా, భార్యలచేఁ బోషింపఁబడినవారు. ఆమాటయందు నిందార్థ ముగర్భితము. భాగవతపువాళ్ళని నాటకులను చులకదనముతోఁ బిలుచుట నిప్పటికిని వినుచున్నాము. ఇట్టి నిరసనవాక్యము లకు నాటకులయందలి నికృష్టజీవనము ముఖ్యకారణమని నిష్పక్షపాతబుద్ధికిఁ దోఁపక మానదు. నాటకులలో స్త్రీపురు

షులు సంఘమందలి నీతికట్టుబాట్ల నతిక్రమించుటయు, దోష వర్తనముల సంచరించుటయు, మున్నగు కారణములచేఁ బ్రజలకు వారియెడల గౌరవము లేక పోవుట సంభవించెను. బైరను మహాకవి (Byron) చెప్పినట్లు "Maidens like moths are ever caught by glare." అనఁగా యువతీమణులు - శలభములవలెఁ గాంతిప్రభలకులోనయి భ్రమయుదురు. విద్యుద్దీప కాంతులును మృదుమధురసంగీత నిస్వనములును, సువర్ణమయాంబరభూషణములును, నర్తకీచంచలవిలాసములును, మాన్నగు చిత్రభ్రమణవిశేషములతో నలరారు నాటకరంగస్థలములు యువతీయువకుల యుల్లంబుల మనోవికారములు జనింపకుండఁ జేయుటెట్లు ? కావున నాటకులును, నాటకాధికారులును తమ స్వజీవితములయందుఁ గట్టుదిట్టములు జేసియు తమయోగ్యనీతికార్యములు జేసినవారిని గఠినముగా శిక్షించియు నిత్యాదిపరిశుద్ధజీవితస్ఫురితములగు కార్యములు నిర్వహించినయెడల వారిని గురించి ప్రజాభిప్రాయములు మారఁగలవు. రంగస్థలములయందు శృంగారాదిరసముల వెలివఱచుచున్నను సంఘజీవితములో యుక్తప్రవర్తకులై యుండవలెను. లేనియెడల వారికి పకీర్తి యేగాక వారవలంబించిన వృత్తికిఁ గూడ నపయశస్సే !

ఇంగ్లాండు దేశమున నిప్పుడు గొప్పనటీనటులు బహుసమ్మానితములగు పదవులయందుండుటయు, గొప్పబిరుదములందుటయు వినుచున్నాము. వెనుకటికాలమందు గ్యారిక్, సిడ

న్సు సున్నగువారు పేరుప్రతిష్ఠలకుఁ దెచ్చిన యీపృష్టి నిప్పటి కాలమందు కీను, ఇర్వింగు మొదలగు నటసత్తములును, టెర్రీ, జెన్నహోప్ లను నటీతిలకములును నవలంబించి యంతకంటె గౌరవనీయమగు దశకుఁ దెచ్చిరి. వీరిలోఁ గొందరు నైటు (Knight) బిరుదములఁ గూడఁ బొందియున్నారు.

అట్టులనే మన దేశమందు నయితము, మహావిద్వాంసులు, గొప్పగ్రంథకర్తలు, ఉన్నతోద్యోగులు మున్నగువారు నాటకులుగానుండి యలంకరించుచున్న నాంధ్రనాటకరంగము నీతిసంపత్తియందును, జ్ఞానవిజ్ఞాన ప్రబోధనమందును, నుత్తరోత్తరప్రవృద్ధిగా వెలయుచు నాటకశాలాసమాజములు ప్రజలచేతను, ప్రభుత్వమువారిచేతను మన్ననలనొందుచు ఆంధ్రనాటకసమాజికులలామముయొక్క కులశీలముల నాచంద్రార్కముగా సంరక్షింతురుగాక !!

శ్లో॥ వాగంగసత్వచేష్టా
చిత్రాభినయ ప్రయోగరచనచణః।
సంసార నాట్యనాయక
పురుషాకారశ్శివోజయతి॥ [అభినవగుప్తాచార్యస్య.]

ఓం !!!



శ్రీచింతామణీ ముద్రాక్షరశాల, రాజమండ్రి.

# Errata.

| Page. | Line. | For | Read. |
| --- | --- | --- | --- |
| 1 | 4 | మహాసీయు | మహాసీయు |
| 1 | 11 | స్వతసిద్ధము | స్వతస్సిద్ధము |
| 2 | 5 | శుద్ధిసలుచుటయే | శుద్ధిసలుచుటయో |
| 2 | 5 | ఇతిహాన | ఇతిహాస |
| 2 | 8 | మహానీయుల | మహానీయుల |
| 2 | 21 | కర్తవ్యము, | కర్తవ్యము. |
| 3 | 16 | స్థలములయందు | స్థలమునందు |
| 3 | 10 | యందుకొన్ని | యందుఁగొన్ని |
| 4 | 14 | యందుపద్య | యందుఁబద్య |
| 5 | 4 | యందుకవిత్వ | యందుఁగవిత్వ |
| 5 | 13 | స్రత్యయో | ప్రత్యయం |
| 5 | 19 | నుపయోగించి | యుపయోగించిరి |
| 5 | 21 | యందుకథా | యందుఁగథా |
| 6 | 1 | శైలియోనుండఁ | శైలిగోయుండఁ |
| 6 | 10 | యందుపురుషులు | యందుఁబురుషులు |
| 6 | 17 | కర్తవ్యమె | కర్తవ్యమే |
| 6 | 18 | నాయిక, | నాయిక. |
| 6 | 21 | చేయనొప్ప | చేయనొప్పు |
| 7 | 3 | నపుడుయెటు | నపుడెటు |
| 7 | 15 | సమ్మతించిన | సమ్మతించిన |
| 7 | 15 | విషయమె | విషయమే |
| 7 | 17 | వక్కాణించిరి | వక్కాణించిరి |

| | | | |
|---|---|---|---|
| 8 | 2 | అంగ్లేయులు | ఆంగ్లేయులు |
| 8 | 3 | నప్పుడుయెటు | నప్పుడెటు |
| 8 | 6 | స్థలములయందు. | స్థలములయందు |
| 9 | 4 | నేమి జేయిదగి | నేమి చేయఁదగి |
| 9 | ౬ | కధలను | కథలను |
| 9 | 21 | మాట్లాడుచూ | మాట్లాడుచు |
| | 22 | దగినటుగా | దగినట్లుగా |
| 10 | 2 | నక్కాణించితిన | నక్కాణించితిని |
| 11 | 2 | వర్ణనశమత్కృతులు, | వర్ణనచమత్కృతులు |
| 11 | 5 | inental | mental |
| 11 | 5 | ఆధ్ర | ఆంధ్ర |
| 11 | 6 | రాజుయుక్క | రాజుయొక్క |
| 11 | 9 | లాపాదితంబులగు | లాపాదితంబులగు. |
| 11 | 10 | గాన్పించును | గాన్పించును. |
| 12 | 4 | సంస్కృత | సంస్కృత |
| 12 | 16 | యునుభవము | యనుభవము |
| 14 | 3 | నపుడు డాంధ్ర | నపుడాంధ్ర |
| 14 | 9 | వేర్వేర | వేఱ్వేఱు |
| 14 | 16 | ప్రయోగించి యున్నారు | ప్రయోగింపఁబడి యున్నవి. |
| 14 | 17 | యథారూపముగా | యథారూపముగా |
| 14 | 21 | ప్రధమము | ప్రథమము |
| 15 | 21 | గొన్ని భాగములు | గయోపాఖ్యానమునఁ గొన్ని భాగములు |

| | | | |
|---|---|---|---|
| 16 | 17 | - గాక. | గాక ! |
| 16 | 17 | విథానముసు | విధానమును |
| 16 | 18 | విద్వాసులు | విద్వాంసులు |
| 16 | 20 | సరిస్థితుల | పరిస్థితుల |
| 20 | 18 | బరిశోధించి | బరిశోధించి |
| 22 | 16 | సాధృశ్య | సాదృశ్య |
| 24 | 22 | పజ్ఞత | పరిజ్ఞత |
| 37 | 23 | లగము | గలము |
| 39 | 19 | కదనంగంభున | కదనరంగంబున |
| 41 | 2 | పులజమలోఁ | పుంజములోఁ |
| 42 | 2 | యుక | యొక |
| 42 | 16 | దేశమలో | దేశములో |
| 49 | 14 | జేయ | జేయు |
| 51 | 7 | దదు | డదు |

---

ఆంధ్రపదములు–పాటలు.

గ్రంథకర్త

ఓరుమళ్ల అచ్యుతరావు, యమ్. ఎ., యల్. టి.,

వెల అ. 0—4—0.

(Approved by the Madras Text-book committee as suitable for libraries.)

అభిప్రాయములు:—

(1) రాయసం వెంకటశివుడుపంతులు ఎమ్.ఎ.,ఎల్.టి., గారు.

"మీరుపంపిన మీచే రచియింపఁబడిన "ఆంధ్ర పదములు-పాటలు' అను గ్రంథమును నందనపూర్వకముగ నందుకొం

టిని, ...ము ఆంధ్రదేశమున వెలసిన, పతివ్రతలు, సుశీలురు, ...డు నగు కొందఱు స్త్రీలయొక్కయు, వీరాగ్రేసరులు, శివభక్తులు, సౌభాగ్యవంతులు నగు కొందఱు పురుషులయొక్కయు చరిత్రలు, పౌరాణికగాథలు మున్నగునవి కొన్ని 'పదములు-పాటలు' రూపమున మనకు నేటివఱకు వచ్చుచున్నవి. ఆ 'పదములు-పాటలు' ఆయానాయకానాయికల గుణవిశేషములను, గాథలను, సృష్టివైచిత్ర్యములను ఉన్నవి యున్నట్లు స్వభావసిద్ధముగ వర్ణించుటకేగాక, గ్రంథప్రచురమునకు సాధనములంతగాలేని పూర్వకాలమున జనసామాన్యమునకు సులభముగ దెలియుటకును, ప్రసంగముగుటకును పూర్వపు గ్రంథకర్తలెట్టి మార్గముల ననుసరించిరో తెలియుటకును సాధకములగుచున్నవి. ఈ 'పదములు-పాటలు' ను సాధారణముగ నూరూరదిరుగు బిచ్చగాండ్రును, కొందఱు స్త్రీలును, బాలురును పాడుచుందురు. అనేకవిధముల నత్యంతోపయుక్తములగు నీ 'పదములు-పాటలు' యొక్క ప్రచురమును బిచ్చగాండ్రకు, స్త్రీలకు, బాలురకును వదలివేసి కాలక్రమమున నాశనముగావించక వానిని స్థిరస్థాయిగా నుంచుటకు మీరు మీగ్రంథమున సూచించిన మార్గములన్నియు సముంజసములు; తప్పక యవలంబనీయములు.

చదివి యానందించుటకు పండితులకును, విద్యావంతులకును ప్రౌఢకావ్యములెట్లు ఆవశ్యకములో యట్లే సామాన్యజనులకా నానందము గొలుపుటకు పూర్వపు 'పదములు-

బుచ్చిన యత్యంతము మిగుల కొనియాడ
గ్రంథమిట్టి రచనలను ప్రోత్సాహపర
న్నాను." రా.

---

2. కవికొండల వేంకటరావు, బి.ఎ.,బి.యల్.,గారు.

కడపటి పుటలలో నాకవితను గురించి ప్రశంసింపబడిం యున్న, ఈ చిన్నటి పుస్తకమునకు పెద్ద యుపోద్ఘాతమును నేను వ్రాసియుందును. [illegible] గేయ సారస్వతము నందు నాయంతటి యభిమానము. అవి పాడునప్పుడు గాని, వానిని గూర్చి ఎవ్వరేని ముచ్చటించు నప్పుడు గాని నా హృదయ ముప్పొంగు చుండును. నిజముగ మ॥రా॥రా॥శ్రీ టేకుమళ్ల అచ్యుతరావు పంతులు ఎమ్.ఎ.,ఎల్.టి., గారిచే విరచింపబడ్డ ఈ "పదములు-పాటలు" అను విమర్శన గ్రంథరాజము తెనుంగుబాస కిత్తరిని చుక్కాని వంటి దనవచ్చును. [illegible] ఏతత్సంగీతోదితంబులను చక్కగ విభజించి, అందలి గుణగణంబులను తూంచి నట్లుగ సరిజూచి సాధుశైలిని మనముందు నిసర్గ గానలహరీ వీచికల నద్దరి నుండి యిద్దరికి దేలించుచున్నది. ఆంధ్ర మహాశయు లెల్లరు నందలి హెచ్చుతికను గమనింతురుగాక !

నరసాపురం. క. వేంకటరావు, బి.ఎ., బి.[illegible]

